

దుర్గావాహినీ అభ్యాసవర్గ - కర్నూలు.



విశ్వహిందూ పరిషత్ - ఆంధ్రప్రదేశ్.

రాష్ట్రస్థాయి (పూ. ఆంధ్ర) భగవద్గీత పోటీలు నిర్వహణ సందర్భంలో తీసిన ఫోటో.



# 'విశ్వహిందు'

(ధార్మిక, సామాజిక మాసపత్రిక)


| సంపుటి : 11 | సంచిక : 2 | ధాత – మాఘం – ఫాల్గుణం | ఫిబ్రవరి – 1997 |
|---|---|---|---|



ప్రధాన సంపాదకులు :

**ప్రొ. బి. రామరాజు**

సంపాదకులు :

**బింగళి సుందరరావు**

సలహా మండలి :

**శ్రీ పి.వి. యస్. నాయుడు**

**డా. కసిరెడ్డి వెంకటరెడ్డి**

చందా వివరములు

జీవిత సభ్యత్వం రూ. 500.00

వార్షిక చందా – రూ. 50.00

విడిప్రతి – రూ. 5.00

డి.డి.లు **'విశ్వహిందు'**

అని మాత్రమే పంపవలెను.



చిరునామా :

'విశ్వహిందు'

4–5–212, ''విజయశ్రీ''

కోఠి, భాగ్యనగర్ – 500 095.

ఫోన్: 517799, 591322.


ఈ సంచికలో ................ పుట



**1989లో ఉత్తమ మాసపత్రిక అవార్డుపొందిన 'విశ్వహిందు'**

# ఏదీ పరిష్కారం

''లోకాస్స మస్తా సుఖినోభవన్తు'' - ''సర్వేజనాస్సుఖినోభవన్తు'' అన్న వేదభూమి, పుణ్యభూమియైన భారత భూమికి భగవంతుడైన శ్రీ కృష్ణ పరమాత్మ దిగివచ్చి భగవద్గీతనందించి ధర్మాన్ని ప్రబోధించి, కర్తవ్యాన్ని గుర్తింపజేశాడు.

మహాఋషులెందరో జన్మించి విజ్ఞానం విరజిమ్మినభూమి. అణువణువున పరమాత్మను గాంచినదీ పవిత్రభూమి. యుగయుగాలుగా యోగ్యమైన, చరిత్ర ప్రసిద్ధమైన దీయోగభూమి. హైందవ భూమి.

విశ్వానికే గురుస్థానం అధిష్టించినట్టిదీ విశిష్ట భారతావని.

పురుషోత్తముడుగా 'రామరాజ్యాన్ని' అందించాడు శ్రీరాముడు, సత్యవాక్పాలనకై భార్యా బిడ్డలను సహితం అమ్ముకున్న సత్యహరిశ్చంద్రుడు పాలించిన సత్యభూమి మన భారతభూమి.

హర్షచక్రవర్తి తనపాలనలో ఐదేళ్ళకోసారి తన కోశాగారంలోని సంపదనంతా పండిత, పౌరులకు పంచి యిచ్చినదానభూమి.

' అశోకధర్మచక్ర' ప్రఖ్యాతంగా అశోకచక్రవర్తి తన ప్రజలకు అనేక సౌకర్యాల కల్పించి పాలించాడు యీ భరతవర్షాన్ని.

చోళుల పరిపాలనా కాలంలో పౌరులు తమ ఇండ్లకు తాళాలు వేయనవసరం లేని న్యాయభూమి యీ భారతభూమి. శౌర్యవంతులైన రాజాధిరాజులెందరో పరిపాలించినట్టిదీ వీరభూమి.

నడిబజారులో రతనాలు రాసులు బోసి విక్రయించిన రత్నభూమి యీ హిందుభూమి.

కాలచక్రభ్రమణంలో హైందవ చక్రవర్తులు, రాజుల ఆలోచనల్లో రాజ్యవిస్తరణా కాంక్ష, స్వార్థం ప్రవేశించి పరస్పర యుద్ధాలు సంభవించాయి. పరస్పర ఈర్ష్య, ద్వేషాసూయలు విసరించాయి. పాలకులలో.

అదిగమనించిన విధర్మీయ విదేశీయుల కండ్లు సకల సంపత్ సమేత భారత మాత మీద పడ్డాయి. దొంగలై వచ్చి సంపదలు దోచుకొని పోయారు మ్లేచ్ఛులు. పాశ్చాత్యులు వ్యాపారులై వచ్చి వ్యవస్థ నెలకొల్పారు, క్రమేణా భారతిని బానిసజేసి పరిపాలించారు.

భారతి దాస్యవిముక్తికై ఝాన్సీరాణి, ఛత్రపతి శివాజీలు పోరాడి జయపతాకలెత్తి నాందిపల్కారు.

అనంతరం లాల్, బాల్, పాల్, మహాత్మాగాంధీ, నేతాజీ, ఆంధ్రకేసరి లాంటి మహోయనాయకుల త్యాగఫలితంగా స్వతంత్ర భూమిగా యీ భరత భూమి నిలిచింది.

నాటి ఆనాటి చరితలు కలలా? నిజమా? అంతటి మహోనీయమైన జన్మభూమి వాసులా? వారసులేనా? వీరనిపించే రీతిలో నేటి నేతలు స్వతంత్ర భారతావనిని పాలించుతీరు పరమ నికృష్టముగాగ ప్రధానులు, ముఖ్యమంత్రులు, మంత్రులు, ప్రజాప్రతినిధులు, ఉన్నతోన్నత ప్రభుత్వ అధికారులు, సహితం స్వార్థపరులై ప్రజాధనం కోట్లకుకోట్లు అపహరించి విదేశీబ్యాంకుల్లో నిలువచేసి కోర్టులు, జైళ పాలై నీచాతి నీచమైన కనివినీ ఎరుగని వారసత్వాన్ని దిగుమతి చేశారు నేడు. పదవులు, ప్రాభవాలు ఆశించి చిన్నాపెద్ద నాయక మ్మన్యులు హత్యా రాజకీయాలతో, కుల, మత, వర్గ విభేదాలు సృష్టించి ప్రజలను విభజించి పీల్చి పిప్పిజేస్తూ, దేశాన్ని ఋణాలపాల్జేసి అధోగతికి తెచ్చి తిరిగి విదేశీ విధర్మీయ శక్తులకప్పగింతురన్న భయసందేహముల కాస్పదులై ప్రజలను దిక్కుతోచని స్థితిలో పడవేశారు.

కంచే చేనుమేసినరీతి అధర్మము, అక్రమము, అన్యాయము ముప్పిరిగొన్న యీ తరుణంలో కాలం విపరీతమై, ప్రకృతి సహితం ప్రకోపించి విలయతాండవం చేస్తూ దేశాన్ని, ప్రజలను అల్లల్లాడిస్తున్నది.

– మరియీ దుస్థితికి పరిష్కారం లేదా? దైవభక్తి, ధార్మిక చింతన గలిగి మానవత్వంతో సమాజసంరక్షణ, దేశసమైక్యతకు దోహదపడే నాయకులు లేరా? లేరన్న సంఘటనలు కోకొల్లలుగా ఋజువౌతున్నయీ ప్రజాస్వామ్య యుగంలో కోట్లాది ప్రజలే పూర్వవైభవాన్ని స్మృతి పథంలోకి తెచ్చుకొని దేశాన్ని, ప్రభుత్వాలను, సమాజాన్ని చక్కదిద్దుకోవలసిన బాధ్యత, అవసరమెంతైనా ఉందనడం అతిశయోక్తి కాదుగదా! తల్లిభారతిని సగౌరవంగా ఆదుకోవడం ప్రతి భారతీయుని కర్తవ్యం కాక తప్పదుగదా. ఆ దిశలో పయనిద్దాం.

జైహింద్.

ప్రజలకొల్లగొట్టి ప్రభుతను చేపట్టి
కుటిల రాజకీయ కూళలైన
వారి పదవు లెల్ల వారించరే ప్రజ
విశ్వ హిందు వాణి వినుడు వినుడు.

– సుందరం.

# శ్రీరుద్రము

డా॥ ఎమ్.వి.ఆర్. శర్మ

హిందువుల కందఱికీ శిరోధార్యమైన విజ్ఞానము వేదములు. ఆ వేదములు యే మానవుల చేతా వ్రాయబడినవి కావు; కేవలము అ పౌరుషేయములు. భగవంతుని విశ్వాసమే వేదరాశి యని మన విశ్వాసము. తార్కికముగా కూడా యీ విశ్వాసమును నిరూపించ వచ్చును.

సంప్రదాయము అడుగంటి, వేద విదులకు ఆదరణ కఱవై, పాశ్చాత్య అనాగరికతా వ్యామోహం లో కొట్టు మిట్టాడుతూ, గ్రుడ్డెద్దు చేలో బడినట్లు ఏ దిశలోయెందుకు వెళుతున్నారో తెలుసుకోకుండానే జీవితాలను దుర్వ్యయం చేస్తూ, అధర్మంలో పుట్టి పెరుగుతున్న మనుష్యుల సంఖ్య నానాటికీ పెరుగుతున్నది. భౌతికావసరాలను పెంచుకుంటూ పోతున్న జనం ఆధ్యాత్మికతను మరిచి పోతున్నది. తద్వారా కష్టనష్టాల పాలవుతున్నది. వేదం కర్మనూ, బ్రహ్మాన్నికూడా. ఘోషించింది. సనాతన భారతీయులు కూడ కర్మ, బ్రహ్మలకు రెంటికీ ప్రాధాన్యాన్ని యిచ్చి వున్నారు.

వేదాలలో యజుర్వేదం సాధారణంగా కర్మ ప్రాముఖ్యాన్ని వివరించింది. అయితే యజుర్వేద మధ్యంలో వున్న రుద్రం అటు కర్మకూ, యిటు బ్రహ్మకూ కూడా వున్న ప్రాశస్త్యాన్ని నినదించింది.

ఈ రుద్రాధ్యాయానికి శ్రీ విద్యారణ్యుల వారు, శ్రీ భట్టు భాస్కరులు, శ్రీ విష్ణుసూరి, శ్రీ అభినవ శఙ్కరులు మఱి యెందరో పండిత ప్రకాణ్డులు భాష్యములను వ్రాసినారు. ఈ పై భాష్యాలన్నీ దేవభాష. ఆ రోజుల్లో వ్యావహారిక భాష కూడా – అయిన సంస్కృతం లోనే వున్నాయి.

'రుద్రం' అనగానే మనకందరికి స్ఫురించేది కోపంతో మండిపోతున్న శంకరుని ''రౌద్ర'' స్వరూపమే. రూఢిలో రుద్ర పదానికి ఆ అర్థమేవున్నది. అయితే సంస్కృతంలో 'రుత్' అంటే దుఃఖం లేదా దుఃఖ కారణం అని అర్థం. ఆ దుఃఖాన్ని పారదోలేవాడు రుద్రుడు. పరమేశ్వరుని దుఃఖ నివారకునిగా, నిర్మూలకునిగా, తాపత్రయ విదూరకునిగా భక్తులు భావించుట, భజించుట, ఆ విధంగా భజించి ప్రయోజనం పొందుట మన మందఱమూ దైనందిన జీవితంలో గమనిస్తున్న నిత్య సత్యాలే కదా!

సరే! మన ప్రస్తుతాంశానికి వద్దాం. ఆ పరమేశ్వరుడు దుఃఖాన్ని సాగొడితే సరిపోతుందా? ఊహుం! దుఃఖానికి కారణాలు యథా తథంగా వున్నప్పుడు, ఆ దుఃఖం మళ్లీ మళ్లీ వస్తూనే వుంటుంది గదా! కనుక మనకు దుఃఖంతో పాటే దుఃఖ కారకాలు కూడా పోవలిసిందే. భగవంతుడు పోగొట్టవలసిందే.

> రుదుఃఖం దుఃఖ హేతుర్వా
> తద్ద్రావయతి నః ప్రభుః
> రుద్ర ఇత్యుచ్యతే తస్మాత్
> శివః పరమకారణమ్.

ఈ రుద్రంలో భగవంతుని నామాలు అనేకం చెప్పబడి వున్నాయి. ఈ నామధేయాలన్నీ అమృత స్వరూపుడైన పరమాత్మను బోధించేవే. వాటిని జపిస్తూ, జపిస్తూ వుంటే మనం కూడా అమృత స్వరూపులమే అవుతాము.

అనేకములైన పేర్లు చెప్పబడి వుండుట చేత ఈ వేద భాగాన్ని ''శత రుద్రీమ'' మని కూడా అంటారు. అంటే పరమాత్మ పేర్లు సరిగ్గా వంద యీ వుపనిషత్తు లో వున్నాయని కాదు; ''శతమనన్తం భవతి'' అను శృతి ననుసరించి చాలా పేర్లు అని అర్థం. మరో విధంగా చెప్పాలంటే అనేక నామాలతో గోచరమయ్యే ప్రపంచమంతా కూడా భగవంతుడే అని భావం.

ఏతాని హవా అమృతస్య నామధేయాని అని సాక్షాత్తూ వేదం కూడా యివన్నీ పరమేశ్వరుని నామధేయాలని చెపుతూ వున్నది.

సదా సర్వకాలముల రుద్రాధ్యాయమును జపించుతూ వున్న వారలకు సాక్షాత్తు ఆ రుద్రుడే తారక బ్రహ్మమంత్రమును ఉపదేశిస్తాడు. అదీ మరణ సమయమందు. ''అత్రహి జన్తో: ప్రాణేషూత్క్రమ మాణేషు రుద్రస్తారకం బ్రహ్మ వ్యాచష్టే'' అని శ్రుతి.

శివుడే కాక యింకా ఇతరేతర దేవతలు చాలా వున్నారు గదా, మఱి రుద్రాధ్యాయాన్ని మాత్రం జపిస్తూ వుంటే ఇతర దేవతాను గ్రహము కలుగుట యెట్లు? దీనికి సమాధానము సూత సంహితలో వున్నది. చెట్టు మూలానికి-వ్రేళ్లకు నీళ్లు పోస్తే కొమ్మలూ, రెమ్మలూ పెంపొందిన విధంగా శివాను గ్రహం చేత మిగతా దేవతలందరూ కూడా సంతుష్టులవుతారు.

వృక్షస్య మూల సేకేన శాఖా:పుష్యన్తి వైయథా శివే రుద్ర జపాత్ప్రీ తేప్రీతా ఏవాన్యదేవతా: (దీన్నే మనం ఇంగ్లీషులో Watering The Roots అంటాము.) ఈ విధంగా రుద్ర జపము వల్ల భుక్తి, ముక్తులు రెండూ లభ్యమవుతాయి.

హిందూ సంస్కృతి సన్యాసానికి అన్నిటికన్నా ఎక్కువ గౌరవాన్ని యిచ్చింది. ఆ సన్యాసులు కూడా జ్ఞాన ప్రాప్తికై ప్రతి రోజూ రుద్రాన్ని పఠించ వలసి వుంటుందంటే - యీ వుపనిషత్తు ప్రాధాన్యం మన కర్థమవుతుంది: అత్యాశ్రమీ సర్వదా సకృత్వా జపేత్ - అని వేదం విధిస్తున్నది. విష్ణు భక్తులు శ్రీ రుద్రమును పఠింప గూడదనునొక అపనమ్మకము కొందరిలో నున్నది. సాక్షాత్తు శ్రీ విష్ణువు, కూర్మ పురాణములో

''నవై పశ్యన్తి తం దేవం
మోహితా మామయా మమ
తతోఽహం స్వాత్మనో మూలం
జ్ఞాపయన్ పూజయామి తమ్'' అన్నట్లు కలదు.

తాత్త్వికదృష్టిలో మేము(శివ కేశవులము) ఏకరూపులమే. ఐనప్పటికీ మాయ చేత మోహితులైన లోకులు మమ్ములను భిన్న రూపులనుగా చూస్తున్నారు అని శ్రీ కృష్ణ పరమాత్మ తానై రుద్రాధ్యాయమును - లోక శిక్షణకై - జపించిన తార్కాణములు మహాభారత, హరివంశాది పవిత్ర గ్రంథములలో అసంఖ్యాకములుగా నున్నవి. కాన సర్వులు శ్రీరుద్ర జపమున కర్హులే.

# స్వాతంత్ర్య యజ్ఞలోచనుడు విప్లవ చంద్రశేఖరుడు

అతడు, అంధకారంపై విరుచుకుపడిన వెలుగుల శరం.... అర్ధరాత్రి వికసించిన పరిమళ కమలం... బ్రిటిష్ దుండగుల గుండెలను కల్లోల పరచిన జాతీయ సమరనాదం, తరతరాల భారతీయులను ఉత్తేజపరిచే వేదం!

చంద్రశేఖర ఆజాద్ అతనిపేరు, మాతృదేశమంతా అతని ఊరు, స్వజాతి దాస్యశృంఖలా విచ్ఛేదక సమరం అతని తీరు! జాతీయ విప్లవానికి అతడు మారుపేరు!!

మధ్యప్రదేశ్‌లోని భావరా గ్రామంలో **1906** జూలై **23**వ తేదీన చంద్రశేఖర్ జన్మించాడు. ఆయన తండ్రి సీతారాం తివారీ ప్రభుత్వ ఉద్యానవనాల శాఖలో తోటమాలిగా పనిచేసేవారు. అతిసాధారణ కుటుంబంలో పుట్టిన చంద్రుడు అసాధ్యమైన కార్యాలను సుసాధ్యం చేయగలిగాడు. ఆయన జీవించింది కేవలం ఇరవైనాలుగు సంవత్సరాలు. కానీ చిన్నప్పటి నుండి ఏదో సాధించాలన్న తపన ఆయనను నడిపించింది. ఈ తపనలోనే ఆయన ఇల్లు వదలి బొంబాయి చేరాడు. రైల్వేస్టేషన్‌లో మూటలు మోశాడు. ఈ అంతర్ జ్వాలకారణం గానే బొంబాయినుండి వారణాసి చేరాడు, సంస్కృత పండితుడయాడు, స్వాతంత్ర్య సమర యోధుడుయ్యాడు. పదునాలుగవ ఏట ఆయన స్వాతంత్ర్య సమరాంగణంలో దూకాడు. అప్పటినుండి అంతిమశ్వాస వరకూ భారతదేశపు బానిస సంకెళ్ళను తెంపడానికై బ్రిటిష్ దుండగులపై బుల్లెట్లు కురిపిస్తూనే వచ్చాడు.

దొంగ వద్ద బిచ్చమెత్తే పద్ధతిలో మన దేశ స్వాతంత్ర్యం కోసం ఉద్యమంజరిగింది. ''దొంగగారూ మా ఇంటిలోని వారిని మంచిగా చూసుకోండి'' అని కొన్నాళ్ళు ''దొంగ గారూ మా ఇంటిని చక్కదిద్దుకునే యోగ్యత సంపాదించాం. మా ఇంటిని మా కప్పగించండి'' అనే పద్ధతిలో కొన్నాళ్ళు ఈ అహింసాయుత ఉద్యమం జరిగింది. కానీ మరోవైపు దొంగ పైదాడి చేసి తరిమి వేసే రీతిలో స్వాతంత్ర్య సమరం కూడ జరిగింది. ఝాన్సీ రాణి నుండి సుభాష్ చంద్రుని వరకూ జాతీయ స్వాతంత్ర్య యజ్ఞస్వరూపులు ఈ సమరాన్ని నడిపారు. దాదాపు ఒక దశాబ్దం పాటు సంగ్రామ సారధి చంద్రశేఖర్ అజాద్. ఈ సాయుధ సంగ్రామం...

''జాతి సంపద నెల్లదోచి
జాతి నేతల జైళ్ళదోసి
భరత సంస్కృతి కాలరాచి
బానిసలు గామనజేసి,
వేదభూమిని బీద భూమిగ
మార్చి వేసిన బ్రిటిషు మూకలు
వ్యాప్తి చేసిన అంధకారము
అంతరించిగ దేశభక్తుల
గుండెలందున ప్రజ్వరిల్లిన
ఉజ్వలంబగు జ్యోతిరా!
జాతినే ఉద్దీప్త పరచిన
చేతనా రవి కాంతిరా!!''

పరశురాముడు, రఘురాముడు, ఆదిశంకరా చార్యుడు, విక్రమాదిత్యుడు, రాణాప్రతాపుడు చత్ర పతి శివాజీ చూపిన బాటలో చెలరేగిన విప్లవమిది.

కానీ దురదృష్టవశాత్తు బ్రిటిష్ మూకలను బిచ్చమెత్తిన కాంగ్రెస్ ఉద్యమమే ప్రముఖంగా ప్రచారం పొందింది. స్వాతంత్ర్య సమర వీరుల మార్గాన్ని కాంగ్రెస్ ఉద్యమ కారులు, బ్రిటిష్ తొత్తులైన

కమ్యూనిష్టులు తీవ్రంగా వ్యతిరేకించారు. వారికి సహాయం అందివ్వలేదు. అందువల్ల బ్రిటిష్ వారు స్వాతంత్ర్య సమర యోధులను బాదలకు, తూటాలకు బలిచేయగలిగారు. ఉరికంబాలను ఎక్కించ గలిగారు.

జాతీయతత్వం నరనరాల్లో జీర్ణించుకున్న చంద్రశేఖర్ 14 ఏళ్ళ వయస్సులో బ్రిటిష్ పెత్తనం పై తిరగబడ్డాడు. బ్రిటిష్ దోపిడీకి ప్రత్యేకమైన పోలీసులపై దాడిచేశాడు. చంద్రశేఖర్ దాడిలో ఒక పోలీసు అధికారి తలపై గాయమయ్యింది. ఒక వృద్ధుణ్ని లారీలో చితక బాదిన ఆ పోలీసు దుశ్చర్యను చంద్రశేఖర్ వ్యతిరేకించాడు. ఫలితంగా పోలీసులు ఆ బాలుణ్ణి అరెస్టుచేశారు. ''నీ పేరు ఏమిటి'' అని అడిగిన మాజిస్ట్రేట్‌కు సమాధానంగా, కోర్టుదద్దరిల్లేలా '' ఆజాద్'' (స్వతంత్రుడను) అని సమాధానం చెప్పాడు చంద్రశేఖర్. నాటినుండి ఆ బాలుడు, చంద్రశేఖర్ తివారీ చంద్రశేఖర్ ఆజాద్‌గా ప్రసిద్ధుడయ్యాడు. జాతీయ విప్లవ యజ్ఞానికి ఆజ్యమయ్యాడు. పోలీసులపై తిరుగుబాటుకు ఫలితంగా ఆ బాలుని బెత్తంతో చితక బాదారు. ఒంటిపై రక్తం కాల్వకట్టింది. అది మొదలు... చివరి రక్తపు బొట్టు వరకూ తుది శ్వాసవరకూ చంద్రశేఖర్ ఆజాద్ భారత స్వాతంత్ర్యం కోసం సమరం సాగించాడు.

(14 ఏళ్ళ వయస్సులోనే ఆజాద్ గుండాలను ఎదిరించాడు. మహిళలను వీధులలో వెంటబడి అవమానకరంగా ప్రవర్తించే ఒక గూండాతో కలియబడ్డాడు. అంతే కాదు గుండాను నేలకేసి కొట్టగలిగాడు. ఆనాటి నుండి కాశీలోని అవీధి నుండి గుండాలు అదృశ్యమయ్యారు. మాతృమూర్తులను కీచకులనుండి కాపాడిన అసర భీముడు చంద్రశేఖరుడు.

సామాజిక శీలం, వ్యక్తిగత సౌశీల్యం పెనవేసుకున్న జాతీయ విప్లవమూర్తి ఆజాద్. స్వాతంత్ర్య సమరం కోసం రహస్య జీవనం గడుపవలసి వచ్చింది. కొన్ని సమయాలలో దుశ్శీలలైన కొందరు మహిళలు ఆయనపట్ల అక్రమ శృంగార కాంక్ష వ్యక్తం చేశారు. కానీ సౌశీల్యానికి మారుపేరైన ఆజాద్ వారిని తల్లుల వలె భావించి అక్రమ వాంఛలను తిరస్కరించాడు. అందుకే ఆయన అభినవ ప్రవరుడు.

బ్రిటిష్ సామ్రాజ్యవాదులను గడగడలాడించిన ఆజాద్‌ను పట్టించిన వారికి ముప్పైవేల రూపాయల బహుమానం ప్రకటించింది విదేశీయ ప్రభుత్వం. మాన్‌సింగ్, జయసింగ్‌లాంటి మాతృద్రోహులు చంద్రశేఖర్ ఆజాద్ కాలంలోనూ ఉన్నారు. ఫలితంగా చంద్రశేఖర్‌ను వెన్నాడిన పోలీసులు, సైనికులు ఆయనను చుట్టుముట్టగలిగారు. 1931 ఫిబ్రవరి 27వ తేదీన అలహాబాద్ లోని ఒక పార్కులో ఆజాద్, మరో సహచరుడు పద్మవ్యూహంలో చిక్కుకున్నారు. దాదాపు వందమంది పోలీసులు వారిని చుట్టుముట్టారు. అభిమన్యునివలె పోరాడిన ఆజాద్ ఆచంద్ర తారార్కం భారత చరిత్రలో జాతీయ జాగృతి రూపంగా నిలచి పోయాడు. మిత్రుణ్ణి తప్పించగలిగాడు, అనేకమంది శత్రువులను మట్టు బెట్టగలిగాడు. చివరకు అహుతుడయ్యాడు. ఆజాద్‌కు రక్షణ కవచంగా నిలచిన ఆపార్కులోని చెట్లలో గాయపడని చెట్టులేదు, బుల్లెట్లు దిగని చెట్టు లేదు.

స్వేచ్ఛా కాంక్షలు నిండిన
రక్తంతో తర్పణం।
కనిపెంచిన మాతృదేవి
ఋణంతీర్చ అర్పణం।

సమర యజ్ఞ జీవనమై
అమరమయ్యేకణం కణం।
చరితార్థ 'స్వ' రూపానికి
అతని చరిత దర్పణం!

మాతృమందిరం

# ఆదినుండి ఆధునికం వరకు స్త్రీ

(గత సంచిక తరువాయి)

- శ్రీమతి డి.జి. విజయలక్ష్మి

అంతేకాదు భార్య పురుషునిలో అర్థభాగమను భావము గల మంత్రాలు కలవనేకం. అందొకటి - ''అధో అర్ధోవా ఏష ఆత్మనః యత్పత్నీ''

అలాగే భార్యంటే భర్తకు సేవకురాలు కాదు. స్నేహితురాలు అని వివరించే ఋక్కులు కూడ వున్నాయి.

సఖా సప్తపదాభావ సఖాయా సప్త పదాబభూమ ఇత్యాది మంత్రము వలన భార్యాంటే భాధ్యత వహించేదే కాదు స్నేహితురాలు అని కూడ తెలుస్తుంది. ఏడడుగులు కలిసి వైచిన నీవు నాకు స్నేహితురాలవగుము. ఏడడుగుల చేత ఇరువురము స్నేహితులమగుచున్నామని భావము. అయితే దంపతుల స్నేహము ఇతర స్నేహముల కంటే భిన్నమైనది. ఇతర స్నేహములు హితకరములు; మానసికోల్లాస జనకములు. కాని దాంపత్య స్నేహము శాశ్వతము. మానసిక, శారీరకానందములు ఒనగూర్చునది.

ఇలా స్త్రీ పురుషులకు సమాన ప్రతిపత్తి చెప్పబడింది కాని పురుషాధిక్యతకు తావు లేదెక్కడా! ఆమెను సమానుర్రాలిగా చూచుటయే కాక తననామె కర్పించుకున్నట్లు కూడ ఋక్కులలో చెప్పబడింది. స్త్రీ స్థానం పాదాలచెంతనే అనే దురూహను దూరం చేసే మంత్రం కూడ వుంది.

''మూర్ధానం పత్యురారోహ'' అనుమంత్రమునకు ఓ వధూ! భర్తనగునా నెత్తినెక్కుము అని అర్థం.

అంతేకాదు ఆనాటి స్త్రీ హోమాల ద్వారా సపత్నుల్ని జయించి, భర్తను వశంచేసుకున్నానని ఆనందించింది. ఆమెనైతో మీశచి అనే ఋషిక. 10వ మండలం 163వ సూక్తంలో మంత్రాల ద్రష్ట అవి ఏమిటంటే.

2వ మంత్రం అహం కేతురహం మూర్ధా అహముగ్రా వివాచనీ!

మమేదనుక్రతుం సేహో నాయా ఉపాచరేత్!

కేతనాన్ని నేనే. శిరస్సును నేనే. నేర్పరిని నేనే. నేను విజయినిని. నా ఇచ్ఛకు ...పతి తలవంచుతాడని భావము.

యేనేంద్రో హివిషాకృత్వా భవత్ - ఇత్యాది మంత్రమునకు - ఏ ఆ...తిని అర్పించి ఇంద్రుడు ప్రతిభాశాలి, మహిమాన్వితుడయ్యాడో దానిని నేను అర్పించి నా ...సపత్నుల్ని ఎదిలించుకు...న్నాను అని భావము.

దీనిని బట్టి ఋగ్వేదకాలంలో కన్యలు గాని వివాహితలు, గాని, హోమాల...చేస్తూ...తల అనుగ్రహం పొందేవారని తెలుస్తుంది.

ఈనాడు నాగరికత పెరిగిందని, స్త్రీ ఉన్నతిని సాధించిందని మనం చెప్పుకునే ...శాలన్నీ ఏనాడో అమలు పర్చబడినవేనని తెలియజేసే ఋక్కులు తెల్సుకుందాం! ఋ - 10వమండలంలో 8వ సూక్తంలో 3వ మంత్రముయొక్క భావం - ఓ నారీ! లే విగత ప్రాణుడైన వాని గూర్చి చింతించకు. చనిపోయిన వానిని వదిలిపెట్టు. సజీవులుగల ప్రపంచంలోకిరా. నిన్నె వరైతే వివాహాని కిష్టపడతారో వారికి పత్నివికా'' అనివుంది. అంటే వితంతు వివాహాలు, పునర్వివాహాలు ఆనాడున్నాయన్నమాట!

ఇలా గమనించినట్లైతే ఋగ్వేదంలో ఎక్కడా స్త్రీని కించపర్చినట్లు, పురుషునికంటే అధమురాలిగా చెప్పినట్లు ఆధారాలు లేవు. పైగా వంశాన్ని తరింపజేసే మహోన్నతవ్యక్తిగా ఎనలేని గౌరవం వుందామెకు. ' ఆత్మావై జాయతే పుత్రః' తానే పుత్రుడై జనించును. తనదేహము నశించినను పుత్రుడున్నచో తానీలోకమున నున్నట్లే. జని ధాతువునకు పుట్టుట అని అర్థం. జాయ అనుపదమాధాతువు నుండి వచ్చినదే. భార్య భర్తకు జన్మనిచ్చుచున్నదను భావమే మరో మంత్రము కూడ వ్యక్త పర్చుచున్నది. ''పతిర్జాయయాం సంప్రవిశీతి'' అంటూ స్త్రీ పుత్రులనిచ్చుటచే అతని కవృతత్వమును ప్రసాదించుచున్నదని ప్రశంసింపబడింది కూడ.

**యజుర్వేదము - స్త్రీలు.**

యజుర్వేదంలో స్త్రీ విద్యకు ప్రాధాన్యత ఇవ్వబడింది. బాల్యం నుండి ఆమెకు తల్లిదండ్రులు ఎలాటి విద్య నేర్పించాలీ ఎలా సంస్కరించాలి? ఎలాటి వరునితో వివాహం చెయ్యాలి? ఆమె ఎలాటి భర్త నెన్నుకోవాలి? వైవాహిక జీవితంలో స్త్రీ ఎలా వుండాలి? అలాగే గృహిణీ ధర్మాలు, ఓషధులగుణాలు, వాటిని స్త్రీలే ఎందుకు అభ్యసించాలి? యజ్ఞ కర్మలలో స్త్రీలకెలాటి ప్రాధాన్యత వుంది? మొదలైన విషయాలెన్నో అనేక మంత్రాల్లో చెప్పబడ్డాయి. వాటిని వచ్చేసంచికలో తెల్సుకుందాం! (సంశేషం)

---

# 1997వ సంవత్సరం

| | 1 | 9 | 9 | 7 | | జ<br>అ | ఫి<br>మా<br>న | ఏ<br>జూ | మే | జూన్ | ఆ | సె<br>డి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 8 | 15 | 22 | 29 | శు | బు | శ | మం | గు | ఆ | శు | సో |
| 2 | 9 | 16 | 23 | 30 | భా | గు | ఆ | బు | శు | సో | శ | మం |
| 3 | 10 | 17 | 24 | 31 | కాం | శు | సో | గు | శ | మం | ఆ | బు |
| 4 | 11 | 18 | 25 | - | క్ష | శ | మం | శు | ఆ | బు | సో | గు |
| 5 | 12 | 19 | 26 | - | ల | ఆ | బు | శ | సో | గు | మం | శు |
| 6 | 13 | 20 | 27 | - | తో | సో | గు | ఆ | మం | శు | బు | శ |
| 7 | 14 | 21 | 28 | - | | మం | శు | సో | బు | శ | గు | ఆ |

– శక్తిధర్, – శివాణి




# పీరోజీ మహర్షి (1829-1889)

భక్తివైరాగ్యాలు మూర్తీభవించిన వ్యక్తి, శ్రీరామనామజపసిద్ధుడు, అచలసిద్ధాంతకోవిదుడు, అద్వైత తత్త్వవిదుడు, సంసారంలో ఉంటూ అసంసారివలె జీవితం గడపిన రాజ యోగి పీరోజీ మహర్షి. ఆయన ఆంధ్ర దేశంలో స్థిరపడి పోయిన మరాఠా. పాల్కురికిసోమనాథునికాలం నాటికే ఆరెమరాఠాలు ఆంధ్రదేశంలో స్థిరపడ్డారు. కర్నూలుజిల్లా పత్తికొండతాలూకా కరిణెకల్లు రాజధానిగా పాలించిన ఆరెమరాఠీల చరిత్ర తెలుగు జానపద వీరగాథ. ఛత్రపతి శివాజీ కాలంలోను అటుతరువాతకాలంలోను మహారాష్ట్రులెందరో వచ్చి ఆంధ్రదేశంలో స్థిరపడ్డారు. శివాజీ మనుమడు షాహుజీ. ఆయన మిత్రుడు పాపాజీ గుంటూరు జిల్లా నర్సరావు పేట జమీందారు సైన్యంలో చేరి నెకరికల్లు గ్రామంలో స్థిరపడ్డాడు. ఆయన కొడుకు నర్సోజీ సత్తెనపల్లి జమీందారు మానూరు వెంకటగోపాలరాయనివద్ద సుబేదారుగా ఉండి ఇండ్లుభూములు సంపాదించి సత్తెనపల్లిలో స్థిరపడ్డాడు. సత్తెన పల్లిలో మరాఠావీథి ఉన్నది. నర్సోజీ పరమశాంతుడు, దానదయాశీల గుణవిభూషితుడు. ఆయన భార్య నర్సూబాయి మహాపతివ్రత. ఆదంపతులకు కడుపు పండకపోతే అనేకదివ్యతీర్థాలు సేవించినారు. ఒకనాడు చిదంబర యోగి అనేమహాత్ముడు సత్తెన పల్లికి వస్తే నర్సోజీదంపతులా మహాత్ముని ఆశ్రయించినారు. ఆయన వారికి ఆదిత్య మంత్రముపదేశించినాడు. ఆ మంత్రోపాసనాఫలితంగా వారికి వరుసగా పీరోజీ, వెంకోజీ గోవిందరావు అనే ముగ్గురు కొడుకులు పుట్టినారు. జ్యేష్ఠపుత్రుడు పీరోజీగారే మనకథా నాయకుడు. ఆయన శా.శ. 1751 విరోధి సంవత్సరం ఆషాఢశుద్ధ ఏకాదశి ఆదివారం (క్రీ.శ.12-7-1829) నాడు జన్మించినారు.

పీరోజీ వీథిబడిలో సంస్కృతాంధ్రాలు నేర్చి, స్వయం కృషితో పాండిత్యం సంపాదించినారు. చిన్నప్పటినుండే చిదంబర యోగి ప్రభావం ఆయనలో ప్రతిఫలింపసాగింది. తత్ఫలితంగా భక్తిసంకీర్తనలు వేదాంతతత్త్వాలు మైమరచిపాడేవారు. ఒక నాడు చిదానందులనే యోగి పుంగవుడు సత్తెనపల్లికి వస్తే పీరోజీ ఆయన సేవ చేసి ఆయన దయకు పాత్రుడైనాడు. యోగి తత్త్వంతో పాటు తారకమంత్రం ఉపదేశించి పీరోజీని దీవించి అదృశ్యుడైపోయినాడు. నాటినుండి పీరోజీ తారకమంత్రం జపిస్తూ వేదాంతగ్రంథాలు చదువుతుండేవారు. వయస్సు పెరిగినకొలది ఆయనలో పూర్వజన్మల జ్ఞానం మారాకులు తొడిగింది, పద్యాలు భక్తి కీర్తనలు రచిస్తూ సాధుసంతులను కొలుస్తూ క్రమశిక్షణతో నియమనిష్ఠలతోకాలం గడిపేవారు. యుక్తవయస్కుడు కాగానే నూజివీడు వాస్తవ్యుడు ఘటకాల వెంకోజీ కూతురు వీరాబాయమ్మతో పీరోజీకి వివాహం జరిగింది. వీరాబాయి భర్తృసేవాపరాయణ. ఆదంపతుల అన్యోన్యానురాగం ఆదర్శవంతం. వారి గార్హస్థ్యం బురద నంటని కుమ్మరి పురుగు.పీరోజీ గారిలో ఆత్మదర్శనాభిలాష పెరిగినది. పంచదశి సీతారామాంజనేయ సంవాదం, రామస్తవరాజం, వాసుదేవమననం, భగవద్గీత, ఉపనిషత్తుల జ్ఞానసారం కంఠదఘ్నంగా త్రావినారు. ధారాళంగా ఆయన రచించిన వేదాంతప్రతిపాదకాలైన కీర్తనల్లో పద్యాల్లో ఆవిజ్ఞానం ప్రతిఫలిస్తుంది. సత్తెనపల్లిలో ఉండే గొప్ప వేదాంతి జమిలి శేషయ్య గారివద్ద పీరోజీ పరిపూర్ణతత్త్వోపదేశం పొంది జ్ఞానభాస్కరులై తమ వెలుగు వెల్లువలో వందల శిష్యులను కృతార్థులను చేసినారు. జమిలి శేషయ్యగారు చిట్టెంశెట్టి లక్ష్మణార్యుల శిష్యులు.

1. పీరోజీగారికి బాల్యంలో ప్రాక్తన జన్మల విద్యలబ్బినట్లే యోగసిద్ధులు కూడ అందివచ్చినట్లు నిదర్శనాలున్నవి. ఆయన మనుష్యులను చూచి వారికి సంభవించే మంచి సెబ్బరలు చెప్పగలిగేవారు.

ఆయన తొమ్మిదేండ్ల బాలుడుగా ఉన్నప్పుడు తల్లి నర్సూబాయి ఇతరస్త్రీలతో ప్రక్క వీథిలో పిండి దంచుతుంటే చూస్తూ కూర్చున్నాడు. ఇంతలో బవిరి శెట్టి ఓబయ్య తన పొలం మేసిన పసులను బందెల దొడ్డికి తోలుకపోతూ వెన్నంటి బతిమాలుతున్న ఆలకాపరిని తిడుతూ పెద్దగా అరుస్తున్నాడు. ఆదృశ్యం చూచిన పీరోజీ ఓబయ్యనుద్దేశించి తనకురానున్న ఆపద తెలియక పసులను బందెలో పెట్టబోతున్నాడన్నారు. ఆమాటలు విన్న స్త్రీలు ఓబయ్యకేమి ఆపద వస్తుందని అడిగితే బాలపీరోజీ అతడు సాయంకాలంలోగా చనిపోతాడన్నారు. ఆదుశ్శకునపు మాటలందరికి తెలిస్తే అనర్థం కలుగుతుందని తల్లి తదితర స్త్రీలు ఆ సంగతి కప్పిపెట్టినారు. ఫీరోజీ అన్నట్లే నాటి సాయంకాలం ఓబయ్య ఉరిపోసుకొని చచ్చిపోయినాడు. క్షణాల్లో ఆవార్త ఊరంతా పాక్కింది. నర్సూబాయి, తోటిస్త్రీలు ఆశ్చర్యపోయినారు. పీరోజీగారి కాలజ్ఞానం క్రమంగా ఊరివారికి తెలిసిపోయింది.

2. ఆటపాటల్లోను అందంలోను మేటియైన శ్రీహరి అనేవేశ్య పొరుగూరు మాదలనుండి వచ్చి సత్తెనపల్లిలో కులవృత్తి సాగిస్తున్నది. పీరోజీ అందగాడు నిండు యౌవనంలో ఉన్నవాడు కవీశ్వరుడు జ్ఞాని అని తెలిసిన శ్రీహరి ఆయనకోసం కావలి కాచి ఒకనాడు ఆవీథినుండి పోతున్న పీరోజీ గారిని ఇంటిలోనికి ఆహ్వానించి మర్యాదచేసి జావళీలు వ్రాసి పెట్టవలసిందిగా కోరింది. ఆయన నిరాకరిస్తే లోబరుచుకోవటానికి హావభావాలు ప్రదర్శిస్తూ వరూథినివలె చాలాసేపు వాదించింది. ప్రవరునివలె జితేంద్రియుడైన పీరోజీ చద్దికూటిపై వెన్నముద్దవలె ఏమాత్రం కరుగలేదు సరికదా శ్రీహరికి సుజ్ఞానం బోధించినారు. ఆమె అప్పుడపుడు పీరోజీయింటికి పోయి ఆయన బోధలు వింటూ క్రమంగా విరాగినియై ఉపదేశం పొంది భక్తురాలైనది, మాదలగ్రామం దేవాలయానికి ధ్వజస్తంభమెత్తించింది. ఇప్పటికీ ఆమె పేరుతో ఆధ్వజస్తంభం ప్రసిద్ధం. మాదల శ్రీహరి అనే ఇనుము పీరోజీపాదాలనే పరుసవేది సోకి పసిడిగా మారింది.

3. ఒకప్పుడు పీరోజీగారు పరిసరగ్రామం పాకాలపాడుకు సంచారార్థం వెళ్లినారు. కోట అచ్చయ్య అనే నీలిమందు వ్యాపారి స్వామి సన్నిధికి వచ్చి ''అయ్యా! ఈసంవత్సరం నీలిమందు ఎక్కువగా కొని సత్తెనపల్లిలో నిలువ చేసినాము. దానికి ధర పెరుగుతుందా తరుగుతుందా?'' అని అడిగినాడు. స్వామి ''ధరసంగతి దేవుడెరుగును. ముందుగా ఆనీలిమందంతా మరోచోటికి తరలించండి. ఇప్పుడు నిలువచేసినింటికి ప్రమాదం రాబోతున్నది'' అన్నారు. ఆవర్తకుడు పరుగెత్తి పోయి నీలిమందు మరోచోటికి తరలించినాడు. మరునాడే ఆమొదటి గిడ్డంగి కాలి బూడిదైపోయినది. కోటఅచ్చయ్య తనను నష్టంనుండి కాపాడిన పీరోజీకి కృతజ్ఞతలు తెలిపి ఋషీంద్రుల మాహాత్మ్యం అందరికీ చాటినాడు.

4. ఒకసారి పీరోజీగారు శిష్యసంచారార్థం చిలుకలూరిపేటకు వెళ్ళినారు. ఆసమయంలో సత్తెనపల్లిలో ప్రారంభమైన గత్తర దినదినం గ్రామమంతటా వ్యాపించి తుదకు వీరాబాయమ్మకూ, పాలు చీకే పసిపిల్లవానికి కూడ సోకింది. వాళ్ళు గాబరాపడి చిలుకలూరి పేటకు వార్త పంపినారు. చిలుకలూరి పేట శిష్యులు స్వామిని తిరిగిపోవలసిందిగా ప్రార్థించి రామిశెట్టి సీతారామయ్యను తోడుగా పంపినారు. చిలుకలూరి పేట సత్తెనపల్లెకు చాలాదూరం. సాయంకాలందాకా నడచి ఒకగ్రామంలో విశ్రమించి తెల్లవారి మిగతా సగం ప్రయాణం చేయవచ్చునన్నాడు సీతారామయ్య, కాని మరికొంత దూరంపోతే మరునాడు తొందరగా ఇల్లు చేరవచ్చునని పీరోజీగారు బాటసాగినారు. అవి అమావాస్య చీకటి దినాలు. ఆ త్రోవ దొంగల విహారభూమి. సీతారామయ్య గురువుగారి మాట కాదనలేక లోలోన

దొంగలభయం శంకిస్తూ వెన్నంటి పోతున్నాడు. ఇంతలో దొంగలు వచ్చి చుట్టుముట్టినారు. పీరోజీ “ ఎంతో(బహ్మానందమాయెను-మన చింతలన్నియు దీరిపోయెను” అనేకీర్తన బిగ్గరగా పాడినారు. దొంగలు సమీపిస్తే తమ ఊరు పేరులు చెప్పినారు. ఆదొంగలింతకుపూర్వమే స్వామి మహిమలు విన్నారు కనుక దండాలు పెట్టి సమీపగ్రామం చేరేదాక తోడుండి భక్తి భావంతో వెనుదిరిగిపోయినారు.

5. ఆరాత్రి పీరోజీగారు పొరుగూరిలో విశ్రమించి మరునాడు నాలుగు గడియల ప్రొద్దుకు సత్తెనపల్లి చేరినారు. కలరా వ్యాధి విలయతాండవం చేస్తున్నది. స్వామి సత్తెనపల్లి దీనావస్థను గమనించి ఇంటికైనా పోకుండా ఊరిబావి వద్ద స్నానం చేసి తడిగుడ్డలతో మహాలక్ష్మమ్మ వేపచెట్టు అరుగు వద్ద కూర్చుండి అమ్మవారిపై ఆశువుగా కీర్తనలు మంగళహారతులు సాయంకాలం దాకా పాడి రాత్రి తమయిల్లు చేరినారు. తెల్లవారు సరికి గత్తర నిమ్మళించింది. వీరాబాయమ్మకు శిశువుకు కూడ గండం తప్పింది. ఊరివారంతా స్వామిమాహాత్మ్యం పొగడి వారి ఆజ్ఞమేరకు మరునాడు అమ్మవారి కొలుపులు చేసి కృతార్థులైనారు.

6. ఒకనాడు పీరోజీ గారు వీథిలో చుట్టుమూగిన వారితో మాట్లాడుతూ ఉన్నట్లుండి పరధ్యానంగా, కనబడని జంతువును అదలించినట్లు తమ చేతికఱ్ఱను అటునిటు ఆడించినారు. పరివేష్టించిన వారడిగితే తేరుకొని మేళ్ళవాగుకు పోయిన మన ఆవులమందపై పులి దాడి చేస్తే అదలించినామన్నారు. కొన్ని దినాలకు పసులమందలు సత్తెనపల్లికి తిరిగి వచ్చిన తరువాత పసులకాపరులనడిగితే వారు స్వామి కఱ్ఱతో అదలించిన సమయాననే పెద్దపులి దాడి చేసినట్లు, కొంత సేపటికి ఆపులి ఏ హాని చేయకుండా పారిపోయినట్లు రూఢి చేసినారు. అదివిన్న తరువాత పీరోజీ మహానుభావులనీ కాలమూ దూరమూ అధిగమించి ప్రమాదం గుర్తించి క్రూరమృగాలను కూడ శాసించే మహిమోపేతులనీ జనులు గుర్తించినారు.

7. పీరోజీగారు తమ 54యేట శా.శ. 1805 స్వభాను సంవత్సరం శ్రీరామనవమి (16-4-1883) ఉత్సవాలు దర్శించటానికి సకుటుంబంగా శిష్యులతో భద్రాచలం పయనమైనారు. భద్రాచలానికి రెండుమజిలీల ఈవలి గ్రామం బయట తోపులో సాయంకాలానికి చేరినారు. అప్పటికే ఆకలితో నకనకలాడుతున్న బృందం వంటలు చేసుకుందామని సామాను బండిని సమీపిస్తే అందులో బియ్యం మూట కనపడలేదు. అది ఎక్కడ జారిపోయిందో ఎవరూ గమనించలేదు. అప్పటికే బాగా చీకటిపడినది. పిల్లలు ఆడవాళ్ళు ఆకలితో ఆవురావురంటున్నారు. పీరోజీగారు వాళ్ళదీనావస్థను గుర్తించి కొంతదూరాన ఒక చెట్టు మొదట చేరి భక్తి భావంతో మైమరచి ఆశువుగా “ఎంత నిర్దయమానసుడవు-రామ-నేనెంత వేడిన కనులబడువు” అనే కీర్తన భావయుక్తంగా పాడుతున్నారు. ఒక బ్రాహ్మణుడు నెత్తిపై బియ్యంమూటతో వచ్చి “తోవలో ఈమూట దొరికింది మీదైతే తీసుకొం” డని సామానుబండి తోలే వానికిచ్చి పోయినాడు. వాడు వచ్చి పీరోజీగారికీ వార్త చెప్పినాడు. పీరోజీగారా పారునికై వెదకించి బిగ్గరగా పిలిచినారు. కాని ఆతనిజాడ కానరాలేదు. కరుణా సముద్రుడైన శ్రీరామచంద్రుడే బియ్యంమూట ఇచ్చిపోయినట్లు గుర్తించిన ఆబృందం స్వామివారి భక్తిని మహత్యాన్ని వేనోళ్ళ కొనియాడినారు. పీరోజీ గారు సామాను బండితోలేవాని అదృష్టం పొగడినారు, రామచంద్రుని దర్శనభాగ్యం పొందినందుకు.

8. ఒక భక్తుడాహ్వానిస్తే పీరోజీ మహర్షి గ్రామాంతరం వెళ్ళినారు. అక్కడివారు కొందరు మహర్షి గొప్పదనం కాని భక్తి వైరాగ్యాలు కాని ఎరుగనివారు ఆభక్తునితో మీగురువు గొప్పతనం

ఏమిటి? పదిబస్తాల అన్నం తింటారా? అంటూ వేళాకోళం చేసినారు. అమాయిక భక్తుడు తమగురువు ఏమైనా చేయగలరంటూ వాళ్ళనోళ్ళు మూయించి గురువు సన్నిధికి వచ్చి ఆవమూర్ఖులకు బుద్ధివచ్చేటట్లు చేయండని ప్రార్థించినాడు. శిష్యవత్సలుడైన స్వామి అందుకంగీకరించినారు. ఆ సాయంకాలమే ఆదుడుకులు పది బస్తాల బియ్యం వాటికి తగిన శాకపాకాలు వండించినారు. ఋషీంద్రులు ఒకగదిలో అన్నమంతా రాశిపోయించి దానిమటు వ్యంజనాలన్నీ పెట్టించి అన్న రాశిపై దీపం ఉంచి గది తలుపులు మూయించి ఇష్టదేవతాధ్యానం చేసినారు. పదినిమిషాల తరువాత తలుపు తెరచి చూస్తే ఒక్క మెతుకూ లేదు. దానితో పాటు ఆదుడుకుల అజ్ఞానమూ మటుమాయమైనది.

గుంటూరు కాలేమస్తాన్‌షా వలీగారు (1685-1895) పీరోజీ ఋషీంద్రులింటికి వచ్చి ఏకాంతగోష్ఠి చేసిపోయేవారట. అప్పుడపుడు ఋషీంద్రులు భోజన సమయాన తమతోపాటు మరొకరికి విస్తరి అదనంగా వేయించేవారు. ఎందుకని అడిగితే గుంటూరు కాలేషామస్తాన్ వస్తున్నారనే వారు. వారన్నట్లే భోజన సమయానికి వలీగారు వచ్చి భోజనంచేసి భక్తులను ఆనందవార్ధిలో తేల్చి అదృశ్యులైపోయేవారు. పీరోజీమహర్షుల సమకాలీనులు మరొకమహాపురుషులు నిజాంరాజ్యం హుమ్నాబాదు (ప్రస్తుతం బిదరుజిల్లా కర్ణాటక) వాస్తవ్యులు మాణిక్యప్రభువులు (1817-1865) జగత్ప్రసిద్ధులు. దత్తాత్రేయుని కలియుగావతారాలు శ్రీపాద శ్రీవల్లభులు, నరసింహ సరస్వతి తరువాత పేర్కొనదగినవారు మాణిక్యప్రభువులు. వారుకూడ పీరోజీ మహర్షిని తమ సాటివారుగా గుర్తించినారు. గుంటూరు జిల్లా ధర్మవరం, దుర్గి (మండలం) చిరుమామిళ్ళ సుబ్బదాసు (1802-1882)గారు ఆనాటి మరొక మహాపురుషులు.

పీరోజీగారు క్లిష్టమైన అద్వైత వేదాంతాన్ని సులభసుందరంగా బోధించటం చేత సత్తెనపల్లి వాస్తవ్యులే కాక దూరప్రాంతాలవారు కూడ వచ్చి వారి ప్రబోధలు విని ఆకృష్టులై శిష్యులు భక్తులు ఐనారు. అట్టి వారిలో గరుడాచలపాలెం యెనుముల కొండయ్య, కుందురివారి పాలెం కుందురు పాపిరెడ్డి వెంకటరెడ్డి, వరుసతాళ్ళూరు యీవూరు వీరారెడ్డి, సత్తెనపల్లి మున్నలూరు వెంకటరెడ్డి, కొమిరెపూడి జిల్లేళ్ళమూడి అచ్చయ్య, జంగా రామిరెడ్డి, ఏటుకూరు వనమా సుబ్బారాయుడు, దీపాలదిన్నెపాలెం పాటిబండ్ల వీరయ్య ప్రముఖులు. ప్రభుత్వోద్యోగుల్లో కారెంపూడి ఆసుపత్రిడాక్టర్ తిరుచునాపల్లి రంగస్వామిశెట్టి (మద్రాసు), సత్తెనపల్లిపోలీసు ఇన్స్పెక్టర్ కూరేటి నాగన్ననాయుడు, తుమురుగోడు డాక్టర్ గోవిందరాజులు నాయుడు మొదలైన వారు ముఖ్యులు. వీరిలో రంగస్వామి శెట్టికి మొదట వేదాంత మన్నా వేదాంతులన్నా చులకన భావం ఉండేది. పీరోజీ గారిని పరీక్షించటానికి ఆయన తమగ్రామానికి రప్పించుకొని తమవద్ద ఉంచుకొన్నారు. కొన్ని దినాలు వేదాంతశ్రవణం చేసి క్రమంగా ప్రభావితులై శిష్యులుగా మారి అద్వైతవేదాంతం ఒంట బట్టించుకొని పారమందినారు; స్వయంగా గురుశిష్య సంవాదరూపంలో 'ముక్తిప్రదాయిని' అనే గ్రంథం రచించి ప్రకటించినారు. ఆయన కీర్తి గుంటూరు జిల్లాలో బాగా వ్యాపించింది. క్రమంగా ఆయన కూడ గొప్ప తత్త్వ వేత్తగా సిద్ధపురుషుడుగా విఖ్యాతుడైనాడు. పీరోజీ మహర్షి కేవలాద్వైతులు కనుక జాతిమత భేదాలు పాటించక అన్ని మతాలవారిని అన్ని వర్ణాల వారిని తమ శిష్యకోటిలో చేర్చుకున్నారు. వారి ముఖ్యశిష్యుల్లో రామదాసు, అప్పలస్వామి పంచములు, కుంకలగుంట లాల్‌సాయెబు ముస్లిం. ఈసాయెబు పీరోజీ మహర్షికి శిష్యుడైన సందర్భం వింతగా ఉంటుంది. (సశేషం)

# బజరంగదళ్ అఖిలభారత శిక్షకుల ప్రశిక్షణ శిబిరం

– గో. శ్యామప్రసాద్ ముఖర్జీ

1996 డిశంబరు 29 నుండి 1977 జనవరి 3వ తేదీవరకు ఆరురోజులపాటు కాన్పూరులోని అగ్రసేన్ వ్యాయామశాలలో బజరంగదళ్ అఖిలభారత శిక్షకుల శిక్షణ శిబిరం జరిగింది. దేశంలోని 27 ప్రాంతములనుండి 123 మంది బజరంగ దళ్ కార్యకర్తలు శిక్షణపొందారు.

ఈ శిక్షణ శిబిరంలో ఉదయం 2-30 గంటలు, సాయంత్రం 2.30గంటలు శారీరిక శిక్షణ ఉండేది. యోగాసనాలు, కరాటే (నియుద్ధ), కర్రసాము (దండ), అడ్డంకులను అధిగమించుట (Obstacle Training), లక్ష్య భేదన (Aiming) మొదలైన విషయాలలో శిక్షణ యివ్వబడింది.

శారీరిక శిక్షణతో పాటు సిద్ధాంతపరమైన అంశములగురించి, కార్యక్రమాల నిర్వహణగురించిన బౌద్ధిక శిక్షణ కూడ ఇవ్వబడింది. బజరంగదళ్ ఆశయాదర్శాలు, కార్యక్రమాలు, బజరంగదళ్ కార్యకర్తల మానసిక సంసిద్ధత ఎలా ఉండాలి? హిందూ సమాజం ఎదుర్కొనేసమస్యలు, దేశభవిష్యత్ తీర్చిదిద్దటంలో బజరంగదళ్ పాత్ర, గో సంరక్షణ విషయంలో బజరంగదళ్ పాత్ర, విశ్వహిందూపరిషత్ నిర్వహించే నిర్మాణాత్మక కార్యక్రమాలు, ఇస్లాం, క్రైస్తవ మతమార్పిడుల నుండి హిందులను కాపాడటంలో బజరంగదళ్ పాత్ర, యువకులను దేశభక్తులుగా తీర్చిదిద్దటం, మంచివక్తకాగలగటం ఎలా? హిందూ సమాజ సంఘటన-మెలకువలు వగైరా విషయాలలో విపులంగా వివరించటం జరిగింది.

శిబరం ప్రారంభమైన రెండవరోజునుండి హిందూవ్యతిరేక శక్తులు, వారికి కొమ్ముకాస్తున్న ములాయంసింగ్ సమాజవాదిపార్టీ, వివిధముస్లిం శక్తులు ఈ శిక్షణ శిబిరానికి వ్యతిరేకంగా ప్రదర్శనలు, ప్రకటనలు చేయటం ప్రారంభించాయి. శిక్షార్థులను తీవ్రవాద వ్యతిరేక చట్టం క్రింద అరెస్టు చేయాలనీ, అగ్రసేన వ్యాయామశాలను మూసివేయాలనీ ప్రభుత్వంపైన బత్తిడితెచ్చే ప్రయత్నం చేశారు. శిబరం మరింత ఉత్సాహవంతగా, జరిగింది. శిక్షార్థులు మరింత పట్టుదలతో శిక్షణ పొందారు.

శిబిరం ముగింపు ముందురోజు (2వ తేది)రాత్రి శిక్షార్థులు, శిక్షకులు, అధికారులు అంతాకలసి సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహించుకొన్నారు (Campfire) శిక్షార్థులు తమతమ ప్రాంతాల సాంస్కృతిక కళారూపాలను ప్రదర్శించారు. తమిళనాడు నుండి వచ్చిన శ్రీ జవహర్‌బాబు వీరపాండ్య కట్టబొమ్మన్ ఏకపాత్రాభినయం చేయగా, పశ్చిమాంధ్రనుండి వచ్చిన శ్రీ పాండురంగారెడ్డి దుర్యోధన ఏకపాత్రను అభినయించాడు. వక్తృత్వ పోటీలో పూర్వాంధ్ర నుండి వచ్చిన శ్రీ అడివి వెంకట నాగరాజకుమార్ తృతీయ బహుమతిని గెల్చుకొన్నాడు.

శిబిరంలో శ్రీ అశోక్‌సింఘల్‌గారు, ఆచార్యగిరిరాజ కిశోర్ జీ, శ్రీ సదా నంద కాకడేజీ, శ్రీ ఓంకార భావేజీ, బజరంగదళ్ అఖిలభారత అధ్యక్షులు శ్రీ జయభాన్ సింగ్ పవయ్యా, బజరంగదళ్ ప్రధానకార్యదర్శి శ్రీ సురేంద్ర కుమార్ జైన్, విశ్వహిందూపరిషత్ కేంద్రీయ కార్యవర్గ సభ్యులు, పార్లమెంటు సభ్యులు అయిన శ్రీ వినయ్‌కటియార్‌జీలు మార్గదర్శనం చేశారు.

వార్త

# కాశ్మీరు లోయలో హిందువుల ఆస్థులు అన్యాక్రాంతం చేయబడుతున్న విధానం

సేకరణ: క. కోటేశ్వరశర్మ

ముస్లిం తీవ్రవాదానికి బలియై ఇళ్ళు ఆస్తులు వదిలి కట్టుబట్టలతో కాశ్మీరులోయనుండి కాందిశీకులుగా వచ్చిన వారి ఇండ్లు ఆస్తులు ముస్లింలు తమవిగా ఎలాచేసుకొంటారో తెలియచెప్పే వాస్తవగాధ ఇది.

శ్రీ బ్రజ్‌లాక్ తామిరీ శ్రీనగర్‌లోని శివపురా, రాంమున్షీ బాగ్ నివాసి. 1990లో ముస్లిం తీవ్రవాదులు ఇంటిని ఖాళీచేయించి కాశ్మీరులోయ నుండి బలవంతంగా తరిమివేశారు. ఈ విపరీత పరిస్థితి వలన శివపురాలోని శ్రీ బ్రిజ్‌లాల్ స్వంతయిల్లు ఖాళీగా ఉండి పోయింది. ఖాళీగా ఉన్నతన యింటిని మిలటరీ ఇంజనీరింగ్ సర్వీసులో ఉద్యోగంచేస్తున్న అబ్దుల్ కరీం (తండ్రి మహమ్మద్ సుల్తాన్‌షేక్) అక్రమంగా ఆక్రమించుకొన్నాడని తన స్నేహితుని ద్వారా బ్రిజ్‌లాల్ తామిరీకి 1996 మార్చిలో తెలిసింది. 1990 నుండి జమ్ములో తల దాచుకొంటున్న శ్రీ బ్రజ్‌లాల్ పోలీసుస్టేషన్‌లో FIR దాఖలు చేశాడు. దరిమిలా అక్రమ ఆక్రమణ దారుడైన అబ్దుల్‌కరీం శ్రీనగర్ మున్సబు కోర్టుకు వెళ్ళాడనీ, కోర్టు ప్రస్తుతం ఉన్న స్థితినే కొనసాగించమని రెండు పక్షదారులనూ ఆదేశించినదనీ కాశ్మీర్‌రేంజి డి. ఐ. జి 22మే1996 తేదీతో ఒక సాధారణ ఉత్తరంద్వారా శ్రీ బ్రిజ్‌లాల్‌కు తెలియపరిచాడు. అంటే కోర్టు శ్రీబ్రిజ్‌లాల్ తామిరీ యింటిని అబ్దుల్ కరీం అక్రమంగా ఆక్రమించుకొనటాన్ని అనుమతించిందని ఆ వుత్తరం అర్థం. ఆ తర్వాత కోర్టు ఇరుపక్షాల వాదనలు వినటానికి తేదీని నిర్ణయిస్తూ నోటీసులు జారీచేసిందట. ఒక్క నోటీసుకూడ శ్రీబ్రిజ్‌లాల్ తామిరీకి అందలేదు. ఇంతలో అక్రమ ఆక్రమణ దారుడైన అబ్దుల్ కరీం కోర్టువారికి ఈయింటి కేసువిషయంలో ప్రతివాదిగా శ్రీనగర్‌లోని అలీకదల్ నివాసి మహరాజ్ క్రిషక్ వట్లూలనే అతనిని కోర్టుకు చూపించాడు. ఈ మహరాజ్ క్రిషక్ వట్లూ ఎవరో శ్రీబ్రిజ్‌లాల్‌కు అసలు తెలియదు. ఖాళీగా ఉన్నతన యింటి విషయంలో వ్యవహారం నడిపించమని గానీ, అమ్మమనిగానీ, అద్దెకు యివ్వమనిగానీ, ఎవరికైనా ఉండటానికి యివ్వమని గానీ శ్రీబ్రిజ్‌లాల్ నోటిమాటగా కాని, వ్రాతమూలకంగా కానీ ఎవ్వరికీ అప్పగించలేదు.

ఈ పరిస్థితిలో శ్రీబ్రిజ్‌లాల్ తాను జమ్మూలో ఉంటున్నాననీ, కాశ్మీరులోయలోని కోర్టుకు హాజరు కాలేననీ, అక్కడకు వస్తే తన ప్రాణాలకు ముప్పు కలుగుతుందనీ ఈ కేసును జమ్ముకు బదిలీ చేయమని కోరుతూ జమ్ము కాశ్మీరు హైకోర్టుకు అర్జీపెట్టుకొన్నాడు. కాశ్మీరులోయలోని కోర్టులు ఎక్స్‌పార్టీడిక్రీలు (Ex party Decree) ఇవ్వటానికి పాల్పడుతూ హిందువుల ఆస్తులను ఆక్రమణకారులకు చట్టబద్ధంగా అప్పగించుతూ ఉండటం ఈ బదిలీ అర్జీకి మరొక కారణం.

గమనిక: తనయిల్లు ఆక్రమణకి గురిఅయిందనే విషయం తన మిత్రుని ద్వారా శ్రీబ్రిజ్‌లాల్‌కు యాదృచ్ఛకంగా తెలిసింది. లేకపోతే తను కోర్టుకు వెళ్ళటం జరగదు. తన ఆస్థి ఆక్రమణకు గురిఅయిందనీ తెలియదు. రెవిన్యూ రికార్డులను ఎవరికి కావలసినవిధంగా వారు మార్చుకొని కాశ్మీరులోయను వదలి వెళ్ళిన హిందూ కాందిశీకుల యిండ్లను, స్థలాలను చట్టబద్ధంగా తమ సొంతం చేసుకోవటం కాశ్మీరు లోయలో యధేచ్ఛగా జరుగుతున్నది.

ఇదీ కాశ్మీరులోయలో హిందువుల ఆస్తులకు పట్టినగతి.

పరావర్తన

# మేవత్ జోగీలు తిరిగి హిందువులుగా మారుట

అఖిల భారతీయ అవధూతి జోగి మహాసభ అధ్యక్షులు మరియు గోరక్షా పీఠాధీశ్వరులు మహంత్ అవేద్యనాథ్ ఆధ్వర్యంలో సుమారు **471** కుటుంబాలకు చెందిన **250** మందికి పైగా మేవాత్ ప్రాంతానికి చెందిన (రాజస్థాన్) ముస్లిం జోగీలు జనవరి **5, 1997**న నాగర్ పట్టణంలో (భరతపూర్ జిల్లా) తిరిగి వారి మాతృ గర్భమైన హిందూ సమాజంలోకి చేర్చబడ్డారు.

భరత్‌పూర్, అల్వార్ (రాజస్థాన్) మరియు గురుగాంవ్ (హర్యానా) జిల్లాలలోని **40** గ్రామాలకు చెందిన – ఖర్చు తగ్గించుటకు, మరియు మొత్తం అందరిని రప్పించుటకు అయే అసౌకర్యాన్ని తొలగించే నిమిత్తం – కుటుంబ పెద్దలను నాగర్ పట్టణమునకు మాత్రమే పిలిపించినారు.

కుటుంబ పెద్దలచే యజ్ఞము, పవిత్ర గంగా జలపానము చేయించి వారిని తిరిగి హిందువులుగా మార్చిరి. వారికి తలా ఒక రుద్రాక్ష కాషాయాంబరము గంగాజలము కుటుంబంలోని సభ్యులకు కూడ కావలసిన విధంగా ఇచ్చిరి. మహాంత్ అవేద్యనాథ్ గారు వారికి ''గురుమంత్రము''ను కూడ బోధించిరి. వారంతా ఇక భవిష్యత్తులో జీవితాంతము హిందువులుగా వుంటు, హిందు ధర్మ పరిరక్షణకు కృషిచేస్తామని ప్రమాణము చేసిరి.

వారంతా, తాము తమ పూర్వీకుల కాలంలో ఔరంగజేబుచే బలవంతంగా ముస్లింలుగా మార్చబడినామని అసలు గురు గోరక్ నాథ్‌ను శివస్వరూపంగా పూజించే వారమని తెలిపినారు. కాని వీరిని ముస్లిములు కూడ పూర్తిగా తమలో కలువనివ్వలేదని తాము ఇంకను హిందు పద్ధతులనే చాలావరకు పాటిస్తూ వున్నామని చెప్పినారు.

రిల్లీనాథ్ (55సం॥లు) అనే వ్యక్తి మేమంతా తిరిగి హిందువులు గామారటం మా ఇష్ట పూర్తిగా జరిగినదని దీనికి ఎవరూ అభ్యతరం తెలుపులేదని, తెలిపినా మేము లెక్కచేయయని ధృఢంగా తెలిపినారు.

విహెచ్‌పి. నిర్వాహక కార్యదర్శి రాజస్థాన్ విభాగం, శ్రీ జగత్ కిషోర్ పత్రికలవారికి ఈ విధంగా చెప్పినారు 'మేవాత్ జాతులే కాక గజ్జార్, జాద్, రాజపుత్, వేలి, దోఖీ, జోసీ, మీణ, నామీ మరియు ఇంక ఇతర అనేక జాతుల వారంతా కారణాలేవైనా బలవంతంగా మాత్రం మార్చిడి జరుప బడిన వారు, తిరిగి హిందువులుగా మారుటకు ఉత్సుకత చూపుతున్నారు అని చెప్పినారు. హిందూ జాతుల వారే తిరిగి, వారిని తమలో చేర్చుకొనుటకు సిద్ధంగా లేరు. అందువల్ల వారిని హిందుమతంలోనికి తిరిగి మార్చబడి ముందు మన హిందువులలోనే అవలంబన శక్తిని పెంపొందికోవాలని తెలిపినారు.

తిరిగి తమ స్వంత జాతీయ హిందూ స్రవంతిలో జేరుటకు ఉత్సాహం బాగాఉన్నా అనేక హిందువేతరులను తిరిగి ఆహ్వానించుటకు కావల్సిన ఏర్పాట్లు చేయుటకు 'విహెపి' ఎప్పుడు సిద్ధంగా వుందని సోదరులు అందరు కూడ తమ వంతు కృషి చేయాలని విన్నవించారు.

గతంలో అస్పృశ్యత మరియు ఇతర అనేక సాంఘిక దురాచారాల వల్ల చాలామంది, ముస్లిం మతస్తులుగను, క్రైస్తవులుగను మారివున్నను వారంతా తిరిగి హిందూ స్రవంతిలో కలిగి పోవాలని, కలసి మనుగడ కొనసాగించాలని ఉత్సాహం చూపుతున్న సమయంలో, ప్రస్తుత మారిన సాంఘిక వ్యవస్థలో వారిని మనమంతా ఆహ్వానించి హిందు మతోద్ధరణకు కావలసిన గమ్యాన్ని సుగమం చేయాలని లేనిచో మనమే హిందుజాతి ఉద్ధరణ అవరోధకులము అగుదుమని హెచ్చరించినారు.

విహెచ్‌పి అఖిల భారతీయ ధర్మ ప్రచార ప్రముఖ శ్రీ మోహన్ జోషి పై చారిత్మాత్మక సంఘటన కారకులు, మారిన జోగీలుకు కావలసిన ఉత్సాహమునిచ్చురీతులో మొత్తం హిందూజాతి వారి యెడల వున్నదని చెప్పిరి. మారిన వారికి జోగీ సంఘము కూడా ఆహ్వానం పలికి ధైర్యము, స్థైర్యము ఇచ్చురీతిలో తీర్మానము కావించిరి.

(ఆర్గనైజర్)

అనువాదం – ప్రమోద్ వల్ సంగ్ కర్

## "మహిళా, యువతులలో సురక్ష చేసుకొనే శిక్షణ అవసరం"

కర్నూలులోని శ్రీ సరస్వతీ విద్యాపీఠంలో 8-1-97 ఉదయం దుర్గావాహిని అభ్యాసవర్గ (శిక్షణాతరగతులు) ప్రారంభమైంది. రాయలసీమ, తెలంగాణా జిల్లాలోని 250 మంది మహిళలు పాల్గొన్న ఈశిబిరంలో విశ్వహిందూ పరిషత్ ప్రాంత మహిళా ప్రముఖ్ శ్రీమతి చాముండేశ్వరిగారు మాట్లాడుతూ, నేడు మహిళల్లో ఆత్మరక్షణ భావం పెంచుకోవటం చాల అవసరమని, దీనితో బాటు, మనధర్మ రక్షణ, దేశరక్షణ కొరకు దీక్ష తీసుకోవటం కూడ అవసరమని అన్నారు. ఈ కార్యక్రమానికి అద్యక్షత వహించిన శ్రీ సోమిశెట్టి వెంకట్రామయ్యగారు మాట్లాడుతుతూ, హిందూ దేశంలోనే చక్కటి కుటుంబ వ్యవస్థ వుందని, దీన్ని మనం విదేశీయ సంస్కృతిలో చూడలేమని అన్నారు. ముఖ్య వ్యక్తిగా వుపస్థితులైన శ్రీ మంచన గుండేరావుగారు వి.హెచ్.పి ప్రాంత ప్రధాన కార్యదర్శి మాట్లాడుతూ, ప్రతి బాలునికి రాముడు ఆదర్శం, ప్రతి బాలికకు దుర్గ ఆదర్శం కావాలన్నారు. సంభాగ్ సంఘటనా కార్యదర్శి శ్రీ సత్యంగారు మాట్లాడుతూ, ఈనాడు హిందూ ధర్మం విశ్వానికి మార్గదర్శనం చేయవలసిన అవసరం వుందని వక్కాణించారు.

## ముగింపు సభలో

"ఈనాడు స్త్రీలు విద్యావంతులైనా కేవలం తమస్వార్థ పూరిత భావంతో కుటుంబం వరకే పరిమిత మవుతున్నారని" శ్రీమతి డాక్టర్ సీతమ్మగారు 12-1-97వ తేదిన స్థానిక శ్రీ సరస్వతీ శిశుమందిరంలో జరిగిన దుర్గావాహిని. శిక్షణా శిబిరపు ముగింపు సభలో ప్రసంగించారు. స్త్రీలు కుటుంబంతో పాటు సమాజాన్ని, దేశాన్ని గురించికూడ ఆలోచించ వలసిన, బాధ్యత ఎంతైనా వున్నదని తమ అధ్యక్ష ప్రసంగంలో డాక్టర్ సీతమ్మ గారు తెలిపారు.

ఇదే సభలో రాయలసీమ విభాగ్ మహిళా ప్రముఖ శ్రీమతి D.G.విజయలక్ష్మిగారు మాట్లాడుతూ స్త్రీ వాదం పేరిట పురుషులను ద్వేషించటం తగదని అన్నారు. పురుషుడు విద్యావంతుడైతే తానొక్కడికే ప్రయోజనం ఉంటుందని స్త్రీ ధైర్యవంతురాలు, విద్యాధికురాలు అయితే ఆకుటుంబం ఒక చక్కని ఆదర్శకుటుంబంగా మారగలదని తద్వారా దేశానికి మేలు జరగ గలదని విశ్వహిందూ పరిషత్ కార్యాద్యక్షులైన ప్రముఖ మానసిక వైద్యుడు డాక్టర్ శ్రీ M.V.R.శర్మగారు అన్నారు.

యోగ, కరాటె, కర్రసాము మొదలైన అంశాలే కాక స్త్రీలలో తరిగిపోతున్న మానసిక దుర్బలతను, ఆత్మస్థైర్యాన్ని పెంపొందించే అంశాలపైన చర్చాకార్యక్రమాలు జరిగాయి అని తెలిపారు.

ఈ ముగింపు సభలో శ్రీ యం. సుబ్రహ్మణ్యం గారు, శ్రీ వంగాలరామిరెడ్డిగారు, శ్రీ.రామదాస్‌భట్ట్ గారు ప్రసంగించారు.

– మాళిగివసుధ



# ప్రాంతస్థాయి భగవద్గీత పోటీలు

ప్రతి సంవత్సరము మాదిరిగానే ఈ సంవత్సరముకూడ పూర్వాంధ్ర ప్రాంతస్థాయి భగవద్గీత పోటీలు (2వ అధ్యాయము, సాంఖ్యయోగం) ఒంగోలు పట్టణం ఆంధ్రకేసరి విద్యాకేంద్రం జూనియర్ కళాశాలలో **29-12-96** న జరిగినవి.

ముందు ప్రఖండలలో పోటీలు నిర్వహించి. ప్రథమ, ద్వితీయ, తృతీయ వచ్చిన వారికి జిల్లా స్థాయిలలో పోటీలు నిర్వహించి ప్రథమ, ద్వితీయ వచ్చిన బాల బాలికలకు ప్రాంతస్థాయిలో పోటీలు నిర్వహించడమైనది.

మొత్తము **11** జిల్లాలయందు పోటీలు నిర్వహణ జరగగా **10** జిల్లాలనుండి ప్రాంతస్థాయి పోటీలలో పాల్గొనడమైనది. విద్యార్థిణి విద్యార్థులకు, ప్రాథమిక, ఉన్నత, కళశాల, వయోజనులకు స్త్రీలు - పురుషులకు వేరువేరుగా మొత్తము అయిదు శ్రేణులయందు పోటీలు నిర్వహించడమైనది.

**29-12-96** ఉదయం **10** గం॥కు పోటీలు ప్రారంభించి మధ్యాహ్నం **1** గం॥కు పూర్తి చేయడమైనది. మొత్తం పది జిల్లాలనుండి **49** మంది పాల్గొన్నారు. **3**గం॥కు పట్టణ ప్రముఖ వీధులలో మంగళవాయిద్యాలతో, కాషాయధ్వాజాలు చేతభూని భగవద్గీత పారయణం చేసుకుంటు నినాదాలతో, బారతమాత చిత్రపటములో గోమాత సహ ప్రముఖ సాధుసంతులునే శ్రీ శ్రీ శ్రీ నర్సింహదాస స్వామిజీ, శ్రీ బ్రహ్మచారి వెదచైతన్య గార్ల పాదయాత్రతో మార్గదర్శనం చేయగా స్త్రీలు, పురుషులు **185** మంది ఆంధ్రకేసరి జూనియర్ కళాశాల నుండి కొండమీది శివాలయం వరకు **3** కి.మీ శోభయాత్ర జరిగినది.

అనంతరం శివాలయం వేదికగా సా॥**5.30**గం॥కు బహిరంగసభ జరిగినది. ఈ సభకు వచ్చిన శ్రీశ్రీశ్రీ నర్సింహదాస స్వామివారికి శ్రీశ్రీశ్రీ బ్రహ్మచారి వేద చైతన్య స్వామివారికి దేవాదాయ, ధర్మదాయశాఖ అస్సిస్టెంట్ కమిషనర్ శ్రీ చల్లా నవనీశ్వర రెడ్డిగారు పూర్ణ కుంభంతో వేదిక మీదికి స్వాగతించగ శ్రీ బాల కృష్ణారావుగారు మిగతా పెద్దలను వేదికమీదికి ఆహ్వానించారు. శ్రీ నర్సింహదాస స్వామి జ్యోతి వెలిగించగా కుమారి సుమిత్ర (నెల్లూరు) ప్రార్థనతో సభ కార్యక్రమము ప్రారంభమైనది. ఈసభలో పాల్గొన్న ప్రముఖలు.

శ్రీశ్రీశ్రీ కనుమూరి వెంకటరాజుగారు. UHP ప్రాంత అధ్యక్షులు. శ్రీ పి. జగన్నాధం నాయుడుగారు - ప్రినిప్రల్ జిల్లా జడ్జి - ప్రకాశంజిల్లా. శ్రీ కారంశెట్టి వీరాస్వామిగారు - VHP జిల్లా అధ్యక్షులు - ప్రకాశంజిల్లా. శ్రీ చల్లా నవనీశ్వర్ రెడ్డిగారు - అసిస్టెంట్ కమిషనర్, దేవాదాయ ధర్మాదాయశాఖ - ఒంగోలు. శ్రీ.డి. నాగేంద్ర కుమార్‌గారు - డి.యస్.పి - ఒంగోలు. శ్రీ.యన్. వెంకటేశ్వర్లుగారు - VHP. ఒంగోలు పట్టణ అధ్యక్షులు. శ్రీ. బూచేపల్లి సుబ్బారెడ్డిగారు - ప్రొప్రయిటర్ శ్రీ సూర్య గ్రానైట్స్ - చీమకుర్తి

ఈ సభలో శ్రీ నర్సింహదాస స్వామిజీ ఆశీః ప్రసంగం చేయగా. శ్రీ బ్రహ్మచారి వేద చైతన్యగారు సాంఖ్యయోగం ప్రాశస్త్యం వివరించారు. జిల్లా జడ్జిగారు మాట్లాడుతూ. భగవద్గీత బారత దేశములోనే కాదు ప్రపంచంలో ప్రతి వ్యక్తి అచరించదగిన ఎన్నో మంచి విషయాలు వున్న సామాజిక, ధార్మిక విలువలు కల్గిన గ్రంధమని ప్రతి ఒక్కరు తప్పని సరిగా పారాయణం చేయవలెనని దీనికి ఎలాంటి తారతమ్యాలు అవసరలేదని అన్నారు. మరియు హిందుత్వం మతం కాదని ఓ సామాజిక, ధార్మిక వ్యవస్థని అన్నారు. శ్రీ కనుమూరి వెంకటరాజుగారు మాట్లాడుతూ VHP ద్వారా గీతపోటీల నిర్వహణ యొక్క లక్ష్యం, హిందుత్వం యొక్క గొప్పతనం గురించి మాట్లాడారు. ప్రాంత పోటీలలో విజేతలయిన విద్యార్థిని

విద్యార్థులయొక్క పేర్లను పరిషత్ ప్రాంత అధ్యక్షులు శ్రీ కనుమూరి వెంకటరాజుగారు ప్రకటించగా పై కార్యక్రమానికి వచ్చిన అతిథులద్వారా బహుమతి ప్రధానము జరిగింది. ప్రాంత పోటీలలో అయిదు శ్రేణులలో ప్రథమ, ద్వితీయ స్థాయిలలో విజేతలయిన 10మందికి ప్రథమస్థాయి వారికి 516/- ద్వితీయస్థాయివారికి 216/- నగదు బహుమతులతో పాటు, జ్ఞాపికలు, ప్రశంసా పత్రములు బహుకరించడమైనది. అలాగే పోటీలో పాల్గొన్న ప్రతి ఒక్కరికి భగవద్గీత పుస్తకం, ప్రశంసపత్రము బహుమానంగా యివ్వడమైనది. పోటీలకు విచ్చేసిన గౌరవనీయులైన న్యాయనిర్ణేతలకు జ్ఞాపికలు బహుకరించడమైనది.

ఈసభకు విచ్చేసిన శ్రీ బూచెపల్లి సుబ్బారెడ్డిగారు, 97 సం॥నుండి ప్రాంతస్థాయిలో జరిగే పోటీలు ప్రాంతంలో ఏ జిల్లాలో జరిగిన ప్రథమ, ద్వితీయ బహుమతులు ఇవ్వటానికి నిర్ణయంచేసి ప్రకటించారు. కార్యక్రమము ముగింపులో శ్రీ జె. వెంకటేశ్వర్లుగారు. జిల్లా కార్యదర్శి (VHP) ప్రకాశంజిల్లా. వందన సమర్పణ చేయగా సామూహిక శాంతి మంత్రముతో కార్యక్రమము ముగిసినది.
బహిరంగ సభలో 500 మంది స్త్రీలు - పురుషులు పాల్గొన్నారు.

## విజేతలు

1. ప్రాథమికస్థాయి:- ప్రథమ - కె. నాగశ్రీహిత - 5వతరగతి. కోట నెల్లూరుజిల్లా. ద్వితీయ- కె. సౌజన్య - 5వతరగతి నర్సన్నపేట శ్రీకాకుళం జిల్లా.
2. ఉన్నతపాఠశాలస్థాయి:- ప్రథమ - ఇవటూరిసమీర, తణుకు, భీమవరం జిల్లా. ద్వితీయ - కె. అప్పర్ణ, ఎనికేపాడు. విజయవాడ.
3. కళాశాలస్థాయి:- ప్రథమ:- జి. శ్రీభవాని, పొందూరు, శ్రీకాకుళం జిల్లా. ద్వితీయ - వి.సత్యనారాయణమూర్తి, అనకాపల్లి.
4. పురుషులు:- ప్రథమ:- పి. వామనమూర్తి (వీరుఅంధులు) ఒంగోలు. ద్వితీయ:- నారాయణంప్రసాద్, ఫిరంగిపురం - నర్సరావుపేట జిల్లా.
5. స్త్రీలు (పెద్దలు):- ప్రథమ:- సి.హెచ్. సుమిత్ర, స్టోన్‌హౌస్‌పేట - నెల్లూరు.
   ద్వితీయ:- పబ్బిశెట్టి కుసుమకుమారి. ఒంగోలు. ప్రకాశంజిల్లా.

## దాతలు:-

1. Dr.R.V. కృష్ణారావుగారు - కృష్ణచైతన్య నర్సింగ్‌హోమ్.
2. Dr.B.V.S. వరప్రసాదరావుగారు.
3. Dr.K. నరసింహారావుగారు.
4. శ్రీమతి B. దేవకుమారిగారు.
5. శ్రీ M. రామచంద్రరావుగారు - గోవిందాంబిక రెసిడెన్షియల్‌కాలేజి.
6. శ్రీ గోరంట్ల వెంకన్నగారు - కల్యాణిఫాస్టుఫుడ్స్
7. Dr.D. సుధాకరరెడ్డిగారు.
8. Dr. నల్లూరి రంగారావుగారు.
9. శ్రీ యల్లమందారెడ్డిగారు.
   ఇంద్రాణి అపార్టుమెంట్సు.

సౌజన్యంతో నగదు బహుమతులు, గీతోపదేశం మొమెంటో, ప్రశంసాపత్రము విజేతలకు ఇవ్వబడినవి.

- కోటేశ్వర రావు

# 'ఓం' మూలం

– రాజన్

1. భూమిపై మానవుడు 20 లక్షల సంవత్సరాల క్రితమే ఆవిర్భవించినట్లు శాస్త్రజ్ఞులు తెలిపారు.
2. 20 లక్షల సంవత్సరాలుగా మానవులకు భాషలేదు. 10 వేల సంవత్సరాల నుండే చరిత్ర రికార్డుకాబడినది.
3. నేడు 5600, భాషలు వాడుకలో వున్నా, ఏ ఒక భాషా రెండువేల సంవత్సరాల వయసు కలిగిలేదు. సంస్కృతం, చీనీ, గ్రీకు, లాటిన్ భాషలు మాత్రమే 2000 సం॥ చరిత్ర కలిగియున్నవి. గతించిన పురాతభాషలు 5 వేల సంవత్సరాల చరిత్ర లేదు.
4. ప్రతి జీవికి (మానవ, జంతు, పక్షి, కీటకాదులు) ప్రకృతి సహజమైన భిన్నభిన్న శబ్దాన్ని ప్రసాదించింది. పిల్లి మొరగలేదు, కుక్క మ్యావ్‌మనలేనట్లు.
5. అలాగే మానవునకు ప్రత్యేకమైన శబ్దము ప్రసాదించబడ్డది.
6. ఆశబ్దమే 'ఓమ్'. 'ఓమ్' కు నిర్దిష్టమైన అర్థం లేదు. పురాణాలు చెప్పినట్టు అది 'ప్రణవనాదం'. అదే విశ్వనాదం – శబ్దం.
7. నేటికీ మానవాళికి విశ్వవ్యాప్తంగా సహజశబ్దం 'ఓమ్'. ప్రయత్న రహితంగా మానవులు పరస్పరం అప్రయత్నంగా 'ఓమ్' 'మ్'ను ఉచ్చరిస్తారు.
8. గతంలో మానవుడు చిన్న పదాలు ఉపయోగించి భాషను తయారుచేసే సమయంలో 20 లక్షల సంవత్సరాలుగా వస్తున్న మూలశబ్దం ' ఓమ్'కు ప్రత్యేకస్థానం కల్పించాడు.
9. 'ఓమ్'ను మరువకుండా ఉండేందుకై దానిని పవిత్రపదంగా మానవుడు కార్యారంభంలో వాడడం ప్రారంభించాడు.
10. ఆ ప్రణవనాదం 'ఓమ్' (OM) హిందూ ధర్మావలంబులకే గాక క్రైస్తవులకు (OM-EM) 'ఓమెన్'గా, ముస్లిలకు (AAM-EEN) 'ఆమ్–ఈన్') అయినది.

# విశ్వయాత్ర

భారతదేశపు స్వాతంత్ర్యపు రజతోత్సవ పురస్సరముగా, పవిత్ర శ్రీలా ప్రభుపాద శతజయంతి సందర్భమున, యూని వర్సల్ సనాతన పౌండేషన్, న్యూఢిల్లీ వారిఅధ్వర్యమున ది.12 ఆగస్టు 1997 నుండి 18 సెప్టెంబరు 1997 వరకు ప్రపంచయాత్ర నిర్వహించబడమున్నది.

అమ్స్టెరుడామ్, వియన్నా, బెర్లిన్, రోమ్, పారిస్ బ్రెజిల్, లండను, లాస్ ఎంజల్స్, నయాగరా ఫ్రాఫ్స్, టెక్సాస్ మొదలైన దేశములందు 36 దినముల ప్రయాణమునకు ఒక వంద మందికే అవకాశమున్నది. ఒక్కొక్కరికి రూ. 90,000/- ఖర్చు కాగల యీ ప్రపంచ యాత్ర చేయగోరువారు డా.జి. రామమోహనరావు, దక్షిణ ప్రాంత కార్యదర్శి, 18-6-796 (డి) లాల్ దర్వాజ, హైదరాబాదు - 500 053 (ఫోను. 566820)ను సంప్రదించగలరు.

–మిత్తింటి వెంకట్రావు.




# కబడ్డీ - పునర్జన్మ

రాష్ట్రకవి : ఓగేటి అచ్యుతరామశాస్త్రి

ఏతైత ! నవయువకాః!
కబడ్డీంతు క్రీడామః ॥ ఏతైత ॥

క్రీడానాం సర్వాసాం
కబడ్డీ తు శ్రేష్ఠతమా,
సార్వజనిక క్రీడేయం
వీరోచిత క్రీడాఖలు
ఆధ్యాత్మిక క్రీడా కిల
రాష్ట్రీయ క్రీడా నను ॥ ఏతైత ॥

మేదనస్తు ఛేదేన హి
కృశం భవ త్యుదర మిహ,
ఉత్థానక్షమం భవతి
వపు స్తేన లఘుత్వేన,
వ్యాయామ రమణీయం
సంపద్యతే కళేవరం ॥ ఏతైత ॥

ఇహత్యేన సంస్పృష్టః
మృతో భవతి తత్రత్యః,
తత్రత్యేన చ స్పృష్టః
మృతో భవతి ఇహత్యోஉపి,
పర్యాయ క్రమేణాహో !
పురా మృతః పునరుదేతి ॥ ఏతైత ॥

వేదేషూపనిషత్సు చ
బ్రహ్మసూత్ర గీతాసు చ
ప్రతిపాదిత పునర్జన్మ -
గర్భీకృత క్రీడేయం,
దేహాత్మ తత్త్వబోధినీ
వినోదానంద దాయినీ. ॥ ఏతైత ॥

కురుత కురుత విశ్వాసం

ధరత, ధరత శరీరాణి
భవే భవే భరతవర్షే,
భజత, భజత భారతీం,
వ్రజత వ్రజత ధన్యత్వమ్ ॥ఏతైత॥

కబడ్డీ - పునర్జన్మ సంస్కృతగేయం వివరణము

పంకుటం: రండి! నవయువకులారా! రండి! కబడ్డీ ఆడుకుందాం.

చరణం.1 ఆటల్లోకెల్లా కబడ్డీ మిక్కిలి శ్రేష్ఠమైంది. అందరికీ సంబంధించింది వీరోచితమైన ఆట! ఆధ్యాత్మికమైన క్రీడ. జాతీయమైన ఆట!

చరణం.2 ఇది కొవ్వును తీసేసి బొజ్జను తగ్గిస్తుంది. దేహాన్ని తేలికపఱచి, చుఱుకుగా లేపటానికి వీలుకలిగిస్తుంది. ఇదొక, వ్యాయామం, దీనివల్ల శరీరం నవనవలాడుతూ రమణీయంగా తయారౌతుంది. (ఇక్కడ ''కళేవరం'' అని ప్రయోగింపబడింది. అంటే దేహ మని అర్థం. తెలుగులో అలవాట యినట్లు శవమని అర్థంకాదు, ''చందన చర్చిత నీలకళేవర'' అని జయదేవుని ప్రయోగం).

చరణం.3 ఇందులో రెండువైపులా ఆటగాళ్ళుంటారు. ఇటువైపు వ్యక్తి కూతకు వెళ్ళి అటువైపు వ్యక్తిని తాకితే అతడు Outఅయిపోతాడు. అంటే చచ్చిపోయినట్లు లెక్క. అలాగే అటువైపువ్యక్తి కూతకు వచ్చి యిటువైపు వ్యక్తిని తాకితే యితడు చనిపోయినట్టు లెక్క, అలాగే పట్టుకోవటం వగైరా ఎన్నోర కాలున్నాయి. ఇలా ఎన్నోసార్లు జరుగుతూనే ఉంటుంది. ఇదొక చావుపుట్టుకల చక్రభ్రమణాన్ని సూచిస్తుంది. అంటే పునర్జన్మ సిద్ధాంతానికి సంకేత మన్నమాట.

చరణం.4.వేదములు, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత మొ॥వానియందు చెప్పబడిన యీ 'పునర్జన్మ' సిద్ధాంతాన్ని తనలో ఇముడ్చుకొని యీ కబడ్డీ రూపొందించబడింది. ఇది అటు, శరీరతత్త్వాన్ని, ఇటు ఆత్మతత్త్వాన్ని ప్రబోధిస్తూ, అంటే శరీరం క్షణభంగురమనీ, ఆత్మ నిత్యమని చెబుతూ, శారీరకంగా వినోదాన్ని, ఆత్మపరంగా ఆనందాన్ని ప్రసాదిస్తూన్న అద్భుతమైన క్రీడ.

చరణం.5.పునర్జన్మ సిద్ధాంతంలో విశ్వాసవుంచండి. జన్మజన్మాలకు భారతదేశం లోనే పుట్టాలని కోరుకొనండి. పదే పదే యీ తల్లి భారతిని సేవించండి జన్మను ధన్యం చేసుకొనండి.

**- రాష్ట్రకవి డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రి గారి**
''అచ్యుతగీత'' సంస్కృత గేయ కావ్యంనుండి.

# విశ్వకళ్యాణం

- పి.వి. రమణారెడ్డి

విశ్వం సుభూతం సువిదత్రం నో అస్తు

ఈ సమస్త విశ్వమునకు భౌతిక ఐశ్వర్యములు- భగవంతుడు ప్రసాదించుగాక. ఉత్తమ జ్ఞానమునొసంగి విజ్ఞానవంతులనుగాజేయుగాక. చిరకాలము సూర్యభగవానుని దర్శించుచు దీర్ఘజీవులముగా ఉండవలెనని మాత్రము చివరి భాగములో కోరబడినది. ఈ దైవిక భావములను ప్రదర్శించుచు సంస్కృత భాషలో ఒకానొక కవి యిట్లు వ్రాసియున్నారు.

సర్వే భవంతు సుఖినః సర్వే సన్తు నిరామయాః

సర్వే భద్రాణి పశ్యంతు మా కశ్చి ద్దుఃఖభాగ్భవేత్॥

అందరు సుఖపడవలెను. ఆరోగ్యవంతులుగా నుండవలెను. శుభములందఱకు కలుగవలెను. ఎవరికి దుఃఖము కలుగరాదు.

వేదములలో నున్న ప్రార్థనలు ఒక్క భారతీయులైన హిందువుకే కాదు. మానవ మాత్రునకు సంబంధించిన ప్రార్థనామంత్రములెన్నో ఉన్నవి.

భద్రాహం నోమధ్యన్దినే, భద్రాహం సాయమన్తు నః

భద్రాహం నో అహ్నాం ప్రాతా, రాత్రీ భద్రాహమస్తునః॥

అథర్వ 6-128-2

రోజంతయు మాకు శుభము కలుగుచుండవలెను. మధ్యాహ్న కాలము సాయంకాలము మాకు శుభములు కలుగుగాక. ప్రాతఃకాలము, రాత్రికాలము మాకు క్షేమము కలుగుగాక.

యో స్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః

తస్య త్వం ప్రాణేనా ప్యాయస్వ

ఆ వయం ప్యాసిషీమహి గోభిరశ్వైః

ప్రజయా పశుభి ర్గృహైర్ధనేన

అథ.7-815

ఓ పరమేశ్వరా!

ఎవరు మమ్ము ద్వేషించుచున్నారో, మేము ఎవరిని ద్వేషించు చున్నామో వారికి మావలె దీర్ఘాయువును ప్రసాదించుము. మావలె వారును ఐశ్వర్య సంపన్నులై భోగభాగ్యములతో వర్ధిల్లుదురుగాక. మా పశువులు (అశ్వము, గోవులు, కోడెలు వగైరా) బలసంపన్నములు గానుండుగాక, మా పుత్రపౌత్రులు, ధన, ధాన్యములతో తులతూగుదురుగాక. అందరికి కల్యాణము కలుగుగాక. మాకును శుభము కలుగుగాక?

పాఠకమహాశయులారా! పైన చెప్పబడిన వేద మంత్రములలో విశ్వకల్యాణమునకు సంబంధించి ఎంతటి ఉదాత్తభావనలున్నవో చూడండి. విశ్వసాహిత్యమంతా వెదకినను మీకు- ఇంతకంటె సుందరమైన, మానవ కల్యాణదాయకములైన, ఉత్తమ భావములు లభించవు.

**పుస్తకపరిచయం :** **'భారతి'** 55పుటల

కవితాసంపుటి. ఇందులో దేశపరిస్థితులు, మనధర్మానికి, సంస్కృతికి జరుగుతున్నగ్లాని, సామాజికస్థితి, కుటిల రాజకీయాలు, జాతీయత, కుటుంబం, స్త్రీ మొ॥విషయాలపై సులభశైలిలో వ్రాయబడిన షు.140పద్యాలుగలవు.

రచన: శ్రీ పింగళి సుందరరావు - ప్రతి వెల= 20.00

ప్రతులు 1) PVS రాంబాబు, 8.2.34, కొత్తపేట, ఒంగోలు-2

2)సాహిత్యభాండార్, 4-5-212, కోఠి, హైదరాబాద్- -095.

# నేటి భారతం - I

మ॥ శతశోభామయ, దీప్తికేమి? కనుడీకాలంపు దేశంబునున్
మత మౌఢ్యం బది నెంతయో పెరిగి, ఏ మాధుర్య మేలేక, జీ
విత కాలంబున, శాంతి యేవిగతమై, భీతాత్ములై యందరున్
బ్రతుకున్ వెళ్ళగ దీయు చుండిరి కదా! భారంబుగా నేటికిన్ ॥

సీ॥ మనభారతావనిన్, మనకు చాలినయంత
యూరియానిల్వలు ఉన్నగాని ।
ఉత్తమం బైనట్టి యూరియాదెప్పింతు
ధనము నిమ్మనె నాకు భ్రాష్టుడొకడు
యుగముగడిచెగాని యూరియారా లేదు
కాసులేమాయెనో ఊసులేదు ।
కథ ఏమిటని జూడ కంపెనీయేలేదు
మోసగించి మనల ముంచినాడు ।
తే. గీ॥ వాడు మన భారతీయుడే, వంచనమున
నారితేరిన వాడైన చోరఘనుడు
ఇట్టివారలు కల్గిన ఎట్లుమనదు
భారతావని ప్రగతిని బడయగలదు॥

సీ॥ దేశంబు గుట్టును లేశంబు తలపక
పరుల కమ్మగ జూచు భ్రష్టుడొకడు ।
ఈ భూమిలో పుట్టి ఈ భూమికేకీడు
తలపెట్టు నటువంటి భ్రాష్టుడొకడు. ।
కట్నంబుకని కులకాంత ప్రాణంబులన్
దొంగలింపగ జూచు దుష్టుడొకడు. ।
మానవతుల యొక్క మానాల గొని యగ్ని
కీలలద్రోచు నికృష్టుడొకడు. ।
తే. గీ॥ కులపు కుమ్మలాటలు రేపి కుటిలనీతి
తోడ పదవి నందగ జూచు తుచ్ఛు డొకడు.
ప్రశ్న పత్రాల లీకేజి ప్రముఖుడొకడు
వీరలే కదా! నేతలై వెలయువారు ॥

గేయం

# జీవబంధు

మూగ ప్రాణులం! మేము...
కావాలి మాకూ...
స్వేచ్ఛా జీవనం ॥మూగ॥
(1) 'మానవ మాంసం'
తినుట అలవాటై...
మానవ ప్రాణం!
తీసే పులిలా....
మానవ రక్తం!
మరిగిన పులిలా....
మూగ జీవులగు-
మమ్ముల, చంపి;
మాంసం తినటం!
క్రూరత్వం???!!! ॥మూగ॥

చరణం॥ (2) విచక్షణా..జ్ఞానాన్ని కలిగిన, ఆలోచించే...మానవులారా! 'భూత దయతో' ఈ....జగతిలో, మసలుతు। మాంసాహారం మానాలి. అహింసా మార్గం, మేలని తెలుపుతు ''శాకాహారం వాడాలి''. - దయార్ద్ర హృదయం। మానవత్వంతో। 'జీవబంధు' గా జీవించాలి.

-మహ్మమద్ అబ్దుల్ అజీజ్,

---

## ఎప్పుడు...? ఎప్పుడు...? ఎప్పుడు...?

- ప్రభాకర స్వామి

మరుగున పడుతున్న
మానవతను నిలువరించే దెన్నడు!
మరచి పోతున్న
భారతీయతను గుర్తించే దెప్పుడు?
దైన్య పడుతున్న హైందవ సంస్కృతిని
జగజ్జేయ మానంగ చేసే దెన్నడు!
కుహనా సెక్యులిరిజాన్ని కాలరాచి
విశ్వమానవ శ్రేయమే హిందూ ధర్మమని
విశ్వాంత రాళాల్లో విశదం చేసేదెప్పుడు
ఎప్పుడు...? ఎప్పుడు....? ఎప్పుడు....?
వ్యక్తి స్వార్థం తుంచుకొని
జాతి హితం పెంచుకొని
మనో వాక్కాయ కర్మల నేకం చేసి
సత్యం, శాంతి, దయ, ప్రేమల మిళితం చేసి
ప్రతి పౌరుడు నడచిననాడు
ప్రతి భారతీయుడు మెలగిన నాడు
నేటి భారతం దివ్య ధామ మౌతుంది
వసుధైక కుటుంబం సిద్ధిస్తుంది.

# తెలుసుకుందాం

(1) ఆజాద్ హింద్‌ఫౌజ్ నిర్మాత ఎవరు? ఎప్పుడు ఏర్పాటు చేశారు?

(2) రామాయణాన్ని ఆంగ్లంలోకి అనువదించిన గవర్నర్ జనరల్ ఎవరు?

(3) ఒరియా భాషలోనికి మహాభారతాన్ని అనువదించిన ఒరియా కవి ఎవరు?

(4) సుందర నగరమైన ''బెంగళూరు''ను ఎవరు నిర్మించారు?

(5) ''బ్రెజిల్'' అన్న పదం ఏ ఆటకు సంబంధించినది?

(6) క్రికెట్ బంతి యొక్క నిర్ధారిత బరువు ఎంత?

(7) మానవుని గుండె రోజుకు ఎన్ని మార్లు కొట్టుకొంటుంది?

(8) ఇటీవలనే బయట పడ్డ '' ఆయుర్వేదస్కాం''లో ప్రధాన నిందితుడు ఎవరు?

(9) జీన్స్‌వంటి విదేశీ వస్త్రాలను తమదేశంలోని యువకులు ధరించరాదని ఆదేశించిన దేశం ఏది?

(10) భారత దేశంలో ఆంగ్లేయులకు వ్యాపారం చేసుకోవడానికి అనుమతి ఇచ్చిన మొగలు చక్రవర్తి ఎవరు?

(11) ''సర్దార్ వల్లభాయ్ పటేల్ ఇంటర్‌నేషనల్ ఎయిర్‌పోర్ట్'' అని ఇటీవల ఏ విమానాశ్రయానికి పేరు పెట్టారు?

(12) హిమాలయాలను మూడు సార్లు అధిరోహించిన తొలివ్యక్తి ఎవరు?

(13) వార్తా పత్రికా సంస్థలలోని ఉద్యోగులకు మాత్రమే సంబంధించిన అవార్డు ఏది?

(14) హైకోర్టు ప్రధాన న్యాయమూర్తుల పదవీ విరమణ వయస్సు ఎంత?

(15) A A F. అంటే?

(16) హిప్నాటిజంలో ప్రపంచ రికార్డు సాధించి గిన్నీస్‌బుక్‌లో నమోదయిన కర్నూలు వాస్తవ్యులు ఎవరు?

(17) ఆంధ్రప్రదేశ్‌లో రాష్ట్రపతి పాలన ఏ సం॥లో విధించారు?

(18) ఆంధ్రప్రదేశ్‌లో అతి పెద్దమంచినీటి సరస్సు ఏది? విస్తీర్ణం ఎంత?

(19) దాశరధి శతక కర్త ఎవరు?

(20) భారత్‌లో మ॥ 12 గం॥లపుడు వాషింగ్‌టన్‌లో టైం ఎంత ?

(21) భూదాన ఉద్యమ వ్యవస్థాపకుడెవరు?

**జవాబులు:-**

(1) నేతాజీ సుభాష్ చంద్రబోస్, 1943 సం॥. (2) సి. రాజగోపాలా చారి. (3) సరలదాస్. (4) కెంపగౌడ్. (5) హాకీ. (6) 156 గ్రాములు. (7) లక్ష సార్లు. (8) ములాయం సింగ్ యాదవ్. (9) ఉత్తర కొరియా. (10) జహంగీర్. (11) అలహాబాద్ అంతర్జాతీయ విమానాశ్రయానికి. (12) సుందర షెర్పా. (13) బచావత్ అవార్డ్. (14) 62 సం॥. (15) ఆగ్జిలరీ ఎయిర్ ఫోర్స్. (16) నగేష్. (17) 1973 సం॥. (18) కొల్లేరు సరస్సు, 900 చ.కి.మీ. (19) కంచర్ల గోపన్న. (20) ముందురాత్రి 1-30. (21) వినోబాభావే.

సేకరణ:- రమేష్‌బాబు. సి




# గోమాత విశిష్టత

-శ్రీ వై. రాఘవులు

గోవు అన్నిపశువులలో విశిష్టమైనది. గోవు శరీరంలో 33కోట్ల దేవతలున్నట్లు వేదాలు వివరిస్తున్నాయి. గోవు శరీరంలో సూర్యనాడులున్నాయి. అందుచే సూర్యకిరణాలనుండి శక్తిని పొందిన గోక్షీరం ఆరోగ్యకరం.

మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రి తల్లి క్యాన్సర్‌కు! 'పంచగవ్యం' చికిత్సతో పూర్తిగా నయమైందట.

గోమూత్రంతో 104 జబ్బులు నివారించవచ్చునని 'రేనాశంకరశర్మ', రాజస్థాన్ ఆయుర్వేద వైద్యులు ఒక గ్రంధంలో వివరించారు. అలాగే గోవువలని ఉపయోగాలనేకం అంటూ:

(1) గర్భిణీస్త్రీలు 6వ మాసంనుండి ఆవుపెరుగు ప్రతిరోజూ వాడిన సుందరమైన సంతానం కల్గుతుంది.

(2) గోవులోని సూర్యనాడుల వల్ల ఆవులో అయస్కాంతశక్తి ఉద్భవిస్తుంది, కనుక ఆవుచుట్టూ రోజూ ప్రదక్షిణం చేస్తే రక్తపు పోటు నయమౌతుంది.

(3) వేయి ఆవుల పేడతో ఒక మెగావాట్ విద్యుత్ తయారవుతుంది.

(4) గోమూత్రం, పేడలతో తయారయ్యే ఎరువు వల్ల చీడలేకుండా మంచి పంట చేతికందుతుంది.

ఇలాంటి అనేక ఉపయోగాలున్న గోమాతాదిగా గల పశువులను 'హైద్రాబాదు' 'అల్‌కబీరు' వధశాలలో రోజూ వేలాది పశువులను క్రూరంగా యంత్రాలతో వధించి ఆమాంసాన్ని అరబ్ దేశాలకు అమ్మి ధనంసంపాదిస్తున్నారు. అట్టి వధశాలలకు ప్రభుత్వం ప్రోత్సాహమివ్వడం విచారకరం. 'అల్‌కబీరు' వధశాలను మూయించే ప్రయత్నం ఆమధ్య ఆం.ప్ర.లో వి.హిం.ప. బి.జె.పి. R.S.S. సంస్థలు చేపట్టినవి. జైళ్ళపాలు చేసింది ప్రభుత్వం ఉద్యమకారులను.

గుజరాత్‌లో 'గీతాబహన్' అనే మహిళ గుజరాత్ కబేలాలకు తరలించే గోవుల లారీలను ఆపి వేలాది గోవులను కాపాడింది. హైద్రాబాదు వచ్చి గోహత్యను అడ్డుకొన్నది.

అట్టి మహాతల్లి అహమ్మదాబాద్‌లో రిక్షాలో పయనిస్తుండగా కసాయి దుకాణాదారులు కత్తులతో పొడిచిచంపివేశారు. అంతట గుజరాత్‌లో 4 రోజులు బంద్ జరిగింది. ఆ మీదట శాసన సభ ఎన్నికల్లో బి.జె.పి మెజారిటీ పొంది ప్రభుత్వం స్థాపించి, గుజరాత్‌లో గోహత్య చట్టరీత్యా నిషేధించింది.

భారతదేశంలో భారత గడ్డపై జన్మించిన గోవులకున్న సూర్యనాడులు, అయస్కాంతశక్తి మొదలైన సమాజ రక్షకశక్తులు సంకరజాతికి చెందిన 'జెర్సీ' మొదలైన విదేశ గోవులకు లేవు. ఇట్టి గోసంతతిని నిర్మూలించి గోసంపద, సంస్కృతిని నాశనం చేసి మనమాన బిందువులపై దాడిచేస్తున్నారు విదేశీ, విధర్మీయులంతా అందుచే మనం తగిన జాగరూ.

కులమై ఉండాలని సూచించారు శ్రీరాఘవులుగారు హిం.ప. ఆంధ్ర యువతాసమ్మేళనం భాగ్యనగర్‌లో.

# నాలుగులు

చతుర్వేదములు - ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము.
చతురాశ్రమములు - బ్రహ్మచర్యము, గృహస్థము, వానప్రస్థము, సన్యాసము.
చతురుపాయములు - సామ, దాన, భేద, దండనములు
చతుర్యుగములు - కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము, కలియుగము.
చతుర్విధ శృంగార నాయకులు - అనుకూలుడు, దక్షిణుడు, ధృష్టుడు, శఠుడు.
చతుర్విధముక్తులు - సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యములు
చతుర్విధపురుషార్థములు - ధర్మ, అర్థ, కామ, మోక్షములు
చతుర్విధ అభినయములు - ఆంగికము, వాచికము, సాత్వికము, ఆహార్యము.
చతుర్విధవయోవస్థలు - బాల్యము, యౌవనము, కౌమారము, వార్థక్యము.
చతుర్విధప్రమాణములు - ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము.
చతుర్విధరథికులు - మహారథుడు, అతిరథుడు, సమరథుడు, అర్థరథుడు.
చతురంగబలములు - రథములు, ఏనుగులు, గుఱ్ఱములు, కాలిబంట్లు.
చతుర్విధ కావ్యనాయకులు - ధీరోదాత్తుడు, ధీరోద్ధతుడు. ధీరలలితుడు, ధీరశాంతుడు.
చతుర్విధకవిత్వములు - చిత్ర, ఆశు, బంధ, గర్భ.
చతుర్వ్యూహములు - వాసుదేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, సంకర్షణములు.
అంతఃకరణములు - మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము.

- టియారా.

భారతం

# యక్షప్రశ్నలు

1) నీరు ఏది? ఆకాశం.
2) అన్నమంటే ఏది? భూమి.
3) లజ్జఅంటే ఏమిటి? తగని పనులు చేయకుండా ఉండటం.
4) దయ అంటే ఏమిటి? అందరూ సుఖంగా ఉండాలని కోరుకునే మనస్తత్వం.
5) అంతులేని వ్యాధి ఏది? లోభము.
6) ఆలస్యం ఏది? కర్తవ్యాన్ని నిర్లక్ష్యం చేయడం, ధర్మాన్ని నిర్వర్తించకపోవడం.
7) శోకం ఏమిటి? అజ్ఞానము.
8) ధైర్యం అంటే ఏమిటి? ఇంద్రియనిగ్రహము.
9) మూర్ఖుడు ఎవరు? నాస్తికుడు.
10) దైవమంటే ఎవరు? దానఫలం.

- యమ్. రంగారావు.



# సమాజంలో చీడపురుగులు - నివారణ

మనదేశం భారతదేశం. మనమంతా భారతీయులం. మనతల్లి భారతమాత. ఈ భావనతో మనదేశంలోని జాతీయవాదులు జీవిస్తున్నారు. ఈదేశంలో వుంటూ, యీదేశంలో తింటూ, యిక్కడ సర్వసుఖాలు అనుభవిస్తూ యింకెక్కడిదో పాటపాడుతున్నారు, జాతి విద్రోహులు. అలాంటి దుష్టశక్తులల్లో ఒకడు మియా ఆజమ్‌ఖాన్ (యస్.పి., యం.యల్.ఎ.) ఈ దుష్టుడు 'భారతమాత'ను అతి నీచంగా వర్ణించాడు.

ఇటీవల సంభల్ (మురాదాబాద్) ఎం.జి.యం.డిగ్రీ కళాశాలలో ఏర్పాటు చేసిన సమాజశాస్త్రగోష్ఠికి సమాజ్ వాది పార్టీ యమ్.పి.డా॥షఫీకుర్‌రహమన్‌ను ముఖ్య అతిధిగా ఆహ్వానించారు నిర్వాహకులు. కార్యక్రమానికి ముందుగానే వచ్చిన అతనికి ఆచార్యుడు ప్రొ. శ్రీ యస్.కె.శర్మ కార్యక్రమస్వరూపాన్ని వివరించారు. ముందుగా జ్యోతిప్రజ్వలన, సరస్వతిపూజ ఉంటుందని తెలుపగానే కుర్‌రహమాన్ గుర్రుమంటూ శ్రీ శర్మపైకి వచ్చారు. 'నేను సరస్వతి పూజలోనూ, జ్యోతిప్రజ్వలన కార్యక్రమంలో పాల్గొనను. మీరు విద్యాలయాలను కూడా ధార్మిక కేంద్రాలుగా మార్చుతున్నారని ఆ కార్యక్రమాలను బహిష్కరించి అధ్యాపకుల గదిలోకి వెళ్ళి కూర్చున్నాడు. జ్యోతి ప్రజ్వలన, సరస్వతిపూజ జరిగిన తర్వాత వచ్చి కూర్చున్నాడు. తన ఉపన్యాసంలో ఆధునిక యుగంలో యింకా యీ మతాచారాలు, మూఢాచారాలేమిటి? యంటూ పరోక్షంగా హిందుత్వాన్ని విమర్శించాడు. ఇంతలో సమయం 1గం॥45ని॥లు అయ్యింది. ఇప్పుడు నాకు నమాజ్ సమయం అయ్యింది కాబట్టి 15 ని॥పాటు కార్యక్రమమేమి జరుగదన్నాడు. నమాజు చేసింతర్వాత మళ్ళీ మత తత్వాన్ని సంకుచిత తత్వాన్ని గురించి తిట్టడం ప్రారంభించాడు. పరం పరానుగతంగా వస్తున్న సంస్కృతి కార్యక్రమాన్ని మతతత్వ దృష్టితో చూసినవాడు. సంకుచిత తత్వంతో మాట్లాడినవాడు. సంకుచిత తత్వంపై ఉపన్యాసం యివ్వడం కంటే ఆత్మవంచన మరొకటి వుంటుందా?!

అనేకులు మేధావులు మియాషఫీకుర్‌రహమాన్ సంకుచిత తత్వాన్ని విమర్శించారు. 'మురాదాబాద్ లోక్‌సభ నియోజక వర్గం నుండి గెలిచారుకదా, ప్రజలవద్దకు ఓట్లకై వెళ్ళినపుడు హిందువులారా నాకు ఓటు వేయకండి' అనే దమ్ముందాయని ప్రశ్నించడం జరిగింది.

మక్బుల్ ఫిదాహుస్సేన్ కాంగ్రేస్ పార్టీ మద్దతులో రాజ్యసభ సభ్యునిగా ఎన్నికయ్యాడు. అతడు ఒకరేఖా చిత్రంగీశాడు. అందులో యిద్దరు రాజ్యసభ సభ్యులు సభలో నిద్రపోతున్నట్లు మరియు నగ్నస్త్రీలను చిత్రించాడు. అతనే ఇటీవల సరస్వతీ దేవి చిత్రాన్ని నగ్నంగా గీచి తన నగ్నత్వాన్ని బయట పెట్టుకున్నాడు. హిందుత్వం పట్లగల ద్వేషాన్ని వెళ్ళగక్కాడు.

1915సం॥నుండి ప్రసిద్ధగాయకుడైన శ్రీ విష్ణుదిగంబర్ పలూస్కర్ ప్రతిసం॥ము కాంగ్రేస్ అఖిల భారతీయ మహాసభల్లో పాల్గొని సమావేశ ప్రారంభంలో వందేమాతరం గీతం పాడనారంభించాడు. 1923 సం॥లో అఖిలభారతీయ కాంగ్రేస్ మహాసభలు మనరాష్ట్రంలోని కాకినాడలో మౌలానా మహ్మద్ అలీ అధ్యక్షతన జరిగాయి. సభ ప్రారంభంలో పలూస్కర్ వందేమాతరం పాడటానికి వేదిక మీదికి రాగా అలీ అభ్యంతరం పెడుతూ మేళతాళాలు, పాటలు మా మతానికి విరుద్ధమన్నాడు. ఇదొక జాతీయవేదిక, పాడవద్దు అనడానికి యిది మసీదు కాదని పలూస్కర్ గట్టిగా బదులు చెప్పినాడు. అధ్యక్షుడు అలీ యింకేమీ మాట్లాడకముందే పలూస్కర్ వందేమాతరం గీతాన్ని పూర్తిగా పాడిన తర్వాత అలీవచ్చి కూర్చున్నాడు. తల్లీ నీకు వందనమని పాడలేని కఠినాత్ముడతాడు.

ఈలాంటి సంఘటనలు అనేకం జరిగినాయి, జరుగుతున్నాయి. ఇలాంటి జాతి విద్రోహకశక్తులే యీనాటి కుహనా సెక్యులరిస్టులకు ఆదర్శం. ఇలాంటి వారిగురించి మాట్లాడాలంటే నోళ్ళు పడిపోతాయి. వ్రాయాలంటే చేతులు పడిపోతాయి వాళ్ళకు. ఇలాంటి విద్రోహకరశక్తులకు ప్రపంచంలోని ఏ దేశంలోనైనా కఠినమైన శిక్షలు విధించబడతాయి, భారతదేశంలో తప్ప. జాతివిద్రోహక శక్తుల ఆటకట్టించాలంటే జాతీయశక్తులు బలపడాలి. ఇలాంటి సంఘటనలను ఖండించాలి. నిష్క్రియాపరులైన మేధావులున్న సమాజాలల్లో యిలాంటి సంఘటనలు జరుగుతుంటాయి. అలాకాకుండా జాతీయవాదులందరూ క్రియాపరులై సామాజిక చైతన్యరంగాలలో పనిచేయాల్సిన ఆవశ్యకతవున్నది. అలాపని చేసినప్పుడే మన మంతా భారతీయులమనే భావన, మనందరిలో సోదర భావన, మానమాత భారతమాత అనే భావన మరింత వికసిస్తుంది. చీడపురుగుల నివారణ లాలిపాటతో, జోల పాటలతో జరుగదు. పెల్లుబికిన జాతీయశక్తియే చీడపురుగులా సమస్యకు పరిష్కారమవుతుంది. - రచ్చసురేష్

# శ్రీ సత్య సదన్‌లో ధార్మిక కార్యక్రమాలు

పూర్వాంధ్ర ప్రాంతానికి నూతనంగా ఏర్పరచుకొన్న ప్రాంతకార్యాలయం 'శ్రీ సత్యసదన్'ను శ్రీ అశోక్‌సింఘాల్ గారు 1996 అక్టోబరు 30న ప్రారంభించినప్పటినుండి పరిషత్ కార్యక్రమాలు అనేకం శ్రీ సత్యసదన్ ప్రాంగణంలో జరుగుతున్నాయి.

కార్తీక మాసమంతా ప్రతిరోజూ సాయంత్రం కార్తీక పురాణప్రవచనం జరిగింది కార్తీక శుద్ధ ఏకాదశినాడు రుద్రాభిషేకం, సహస్రదీపార్చన జరిగాయి. ఈ కార్యక్రమాలు ప్రాంత సేవా ప్రముఖ్ శ్రీ చల్లా లక్ష్మీనారాయణ, ప్రాంత కార్యాలయ కార్యదర్శి శ్రీ భద్రాద్రి శ్రీ రామచంద్రమూర్తి నిర్వహించారు.

ధనుర్మాసమంతా నిత్యమూ సాయంత్రం శ్రీ విష్ణుసహస్రనామ పారాయణం, ప్రతి శుక్రవారం శ్రీ విష్ణుసహస్ర నామపారాయణంతో పాటు శ్రీ లలితా సహస్ర నామ పారాయణం కూడా జరిగింది. జనవరి 3వ తేదీన ఈ పారాయణ కార్యక్రమానికి మాతాశ్రీ శివచైతన్యగారు విచ్చేసి ఆశీర్వదించారు. శ్రీ మాతాజీతమ ఆశీః ప్రసంగంలో పారాయణ మహోత్మ్యాన్ని, విశ్వహిందూపరిషత్ కార్యక్రమాలలో మహిళల కార్యక్రమాల గురించి వివరిస్తూ కార్యాలయంలో వ్రాసి ఉన్న సూక్తి ''స్వస్మై స్వల్పం. సమాజాయ సర్వస్వం'' స్వంతానికి స్వల్పము - సమాజానికి సర్వస్వము - అనే దాని వివరించి చెప్పారు. ప్రాంత సంఘటనా కార్యదర్శి శ్రీ కోటేశ్వరశర్మ కార్యాలయంలో జరుపనున్న పరిషత్ కార్యక్రమాలను వివరించారు.

కార్యాలయంలో ప్రతి శుక్రవారం లలితా సహస్రనామ పారాయణం, ప్రతి శనివారం శ్రీ విష్ణుసహస్రనామ పారాయణం, ప్రతి మంగళవారం మాతృమండలి జరపటానికి నిర్ణయమైంది. ఈ పారాయణ కార్యక్రమాలను సంస్కృత తపాల శిక్షణ కేంద్ర నిర్వాహకులు, ప్రాంత సంస్కృత విభాగ్ ప్రముఖులు శ్రీ ఉపద్రష్ట వేంకట కృష్ణయ్యగారి మార్గదర్శకత్వంలో విజయవాడ మహానగర్ మహిళా విభాగ్ శ్రీమతి ఝాన్సీ, శ్రీమతి ఉమ, శ్రీమతి కుమారి గార్లచే నిర్వహించబడుతున్నాయి.

అలాగే సంస్కృత శిక్షణ కార్యక్రమంలో భాగంగా వ్యాకరణ శాస్త్రం ''సిద్ధాంతకౌముది'' - శిక్షణను భారత సంస్కృత పరిషత్ పూర్వాంధ్రప్రముఖ్, శ్రీరాణి మురలీ కృష్ణ; సంస్కృతవిభాగ్ ప్రముఖ్ శ్రీ వెంకటకృష్ణయ్య గారలు నిర్వహిస్తున్నారు.

మాఘమాసమంతా నిత్యమూ మాఘపురాణ ప్రవచనం నిర్వహించాలని, మాఘమాసం నుండి మహిళలకు యోగ శిక్షణ తరగతులు ప్రారంభించవలెనని, నిర్ణయమైంది. త్వరలో కార్యాలయ ప్రాంగణంలో వైద్యాలయం ప్రారంభించే ప్రయత్నంజరుగుతుంది.

-భద్రాద్రి శ్రీరామచంద్రమూర్తి

## ...విత సభ్యులు

1021
**676. VISHWANATH NAGESH**
9-1-127, Sarojini Devi Road,
Secunderabad - 500 003.

1022
**677. R.S.LAXMAIAH,**
10-5-810, Nandhanar Nagar
Tukaram Gate,
N.Lalaguda,
Secunderabad - 17.

**678. DR.P.T.CHANDRA MOULY,**
6-3-887, Rajbhavan Road,
Hyderabad - 500 082.

0903
**679. S.VIDYASAGAR GOUD,**
(Devi Krupa)
H.No.18-3-606,
Laldarwaza.
Hyderabad - 500 053.

# అంబేద్కర్ హెచ్చరిక

1945 అక్టోబరు 3న రేడియోలో అంబేద్కర్ ఇలా హెచ్చరిక చేశారు.

''ఇస్లామీ సోదరత్వం సర్వమానవ సౌభ్రాతృత్వం పై ఆధారపడినది కాదు. అది ముస్లింలకు మాత్రమే పరిమితమైనది. ఒక ముస్లింతాను నివసిస్తున్న దేశంపట్ల కన్నమరో ముస్లిందేశం పట్ల ఎక్కువ విశ్వాసపాత్రుడుగా ఉంటాడు. దేశంలో ముస్లిం పాలన ఉన్నపుడు మాత్రమే అతడు దేశాన్ని మాతృభూమిగా పరిగణిస్తాడు. అతడు భారతదేశాన్ని తన మాతృభూమిగాను, హిందువులను తన సోదరులు గాను ఎన్నడూ పరిగణించడు''.

డ్టాక్టర్ అంబేద్కర్ మరో సందర్భంలో ఇలా పేర్కొన్నారు. ''దళిత వర్గాలవారు ముస్లిం మతాన్ని కాని, క్రైస్తవ మతాన్ని కాని పుచ్చుకుంటే వారుహిందుత్వానికి దూరం కావడమే కాక, హిందూ సంస్కృతి నుంచి కూడా వేరవుతారు. ముస్లింలుగాకాని, క్రైస్తవులుగాకాని మారితే వారు జాతి వ్యతిరేకులు అవుతారు.''

''నేను ఇస్లాం మతం పుచ్చుకుంటే కోట్లాదిగా ధనం నాకాళ్ళవద్ద నిలచేది. ఐదు సంవత్సరాలలో ఈ జాతిని నానాభీభత్సం చేసేవాణ్ణి. కానీ, ఒక విగ్రహావిధ్వంసకుడుగా చరిత్రలో అపకీర్తిపాలు కావడం నాకు ఇష్టంలేదు'' అన్నారా మహామనీషి.

తమను ముస్లింలుగా మార్చే, కుతంత్రం వెనుక ఎంతటి స్వార్థం ఉన్నదో, అలామారి నందువల్ల ఎంతటి భయంకర పరిణామాలు సంభవిస్తాయో డ్టాక్టర్ అంబేద్కర్ చెప్పిన మాటలను సర్వహిందువులు, సహృదయంతో అవగాహన చేసుకొనగలరని ఆశించుచున్నాము.

సేకరణ.
తేది: 4-1-1997. చేరెడ్డి శ్రీరామ్ రెడ్డి




# స్నేహకారుణ్యాలే జీవనరసం

ప్రతి మానవుడు సుఖంకోరుతాడు. సుఖం అవసరం లేదనే వారు ఎవరు లేరు. దుఃఖం మాభూయాత్, సుఖం మేభూయాత్ అని సకల ప్రాణులమ నోవాంఛ. జీవితాన్ని రసవత్తరంగా చేసుకోవటానికి మనిషిప్రయత్నం చేయాలి. గీతాచార్యుడు మనకీ మార్గం చూపిస్తున్నాడు. ''అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచః'' అంటాడు గీతాచార్యుడు.

అసలు జీవితంలో ఎప్పుడు ఏడ్చేవారు ఆరుగురట. '' ఈర్ష్యాళువు జుగుప్సావంతుడు, నిస్సంతోషి, క్రోధనుడు, నిత్యశంకితుడు, పరభాగ్యోపజీవి, యవారార్గుమ దుఃఖభాగులు అంటారు పరవస్తు చిన్నయసూరి. మానవుడు ఈర్ష్యాళువైనప్పుడు ద్వేషం అతనిలో ప్రవేశించి మనస్సు ద్వేషరోగగ్రస్తమై, ఎప్పుడు తప్పులు వెతకటంలో నిమగ్నమౌతుంది. నిజంగా కర్తవ్య నిర్వహణలో ద్వేషించటానికి చోటుండదు. ఎదుటి పరిస్థితులనను గురించి వ్యవహరించటం వల్ల రాగద్వేషాలు సమీపించవు. బాగా ఆలోచిస్తే గాని ఇంతులోని నిజం తెలియదు.

ద్వేషించడంవల్ల ద్వేషించే వానినే ఆతని భావనలు బాధిస్తాయి. అవి వాడినే బలితీసుకొంటాయి. అలాకాక ఎదుటివానిలోని మంచిని గ్రహించే నేర్పు మనలో ప్రవేశిస్తె అవి మననే సంతోషపరుస్తాయి. మంచి భావనలతో మనస్సు ప్రశాంతమౌతుంది. మనలోని ద్వేషప్రేమలే సుఖదుఃఖాలకి కారణమయ్యే ప్రాపం చికనియమం ఉన్నది. ఈ నియమాన్ని మనం గ్రహిస్తె మన జీవితం రసవంతమౌతుంది. ఈ రసాన్ని సాధించటానికి, స్నేహం టానిక్‌లా పని చేస్తుంది. అందుకే ''కత్తి నెత్తి జయించనిది కరుణతోడ సులభసాధ్యము – ద్వేషంతో లభింపనిది ప్రేమతోడ సంపాద్యము.'' అంటారు సీ. నారేగారు. స్నేహితుడు తన స్నేహితుని హితం కోరుతాడే తప్ప అహితం కోరడు. ఇలాంటి వారే జీవన రసాన్ని అందుకొంటారు.

ప్రపంచంలో రెండు రకాల మానవులుంటారు. సరిగ్గా బ్రతుకగల్గిన వారు. సరిగ్గా బ్రతుక లేకపోతున్నవారు. సరిగ్గా బ్రతుక లేకపోతున్న వారిని చూచినప్పుడు. రంధ్రాన్వేషణ చేయాలనే బుద్ధిపుడుతుంది. ఇదికూడా ద్వేషం యొక్కమరో రూపం. జీవించలేని వారిని చూచి హేళన చేయటం. వారిలోని తప్పుల జాబితాలు విప్పటం. నవ్వుతూ మాట్లాడటం. ఆతనితో మౌనంగా ఉండాలని కోరుకోవటం. విమర్శిస్తూండటం ఇవన్నీ ద్వేషానికి మారురూపాలే. అప్పుడేప్రపంచంలోని సంతులనం చెడుతుంది. జీవన సౌందర్యం బోసిపోతున్నది. దుఃఖం మనిషిని వేన్నాడుతుంది. స్వాదుత్వం చెడుతుంది. అందుకే శ్రీకృష్ణుడు చక్కని ఉపాయం చెబుతున్నాడు. సరిగ్గా జీవించి ఉన్నవారితో ఏలా స్నేహం చేస్తారో అలాగే జీవించలేనివారిపై కరుణచూపండి. అప్పుడు మీ హృదయం శుద్ధమౌతుంది. మీలో అంకురించిన ఈమైత్రి ఈ కరుణలు మిమ్ముది వ్యత్వం వైపు నడుపుతాయి. మీరు జీవన సౌందర్యం చూస్తారు. రసానందాన్ని అనుభవిస్తారు. నిర్మలులతో స్నేహము నిత్సహాయులపై ప్రేమ ఇవే జీవిత ఆనందానికి దారులు అన్నారు మనపెద్దలు.

ఒక్క పర్యాయం మన ఋష్యాశ్రమాలవైపు చూడండి. అక్కడు వైరత్వంలేదు. విభిన్నప్రాణులు కలిసి జీవిస్తాయి. బుద్ధుడు ఈ వ్రతాన్ని ఆచరించినందు వల్లనే అంగులీమాలుని లాంటి క్రూరుడిని కూడా మార్చగలిగాడు. సృష్టి రహస్యం ఇదే. ''దయయే ధర్మ ముగదయ్య'' అని బసవేశ్వరుడన్నాడు హృదయశబ్దంలోనే దయ ఉందికదా. దయాహృదయమే దేవనిలయమని మనవారెందరో అన్నారు.

వేదము లప్పజెప్పిన, కవిత్వము గుప్పిన, తర్కశాస్త్రసం

వాదము లందుకొన్న, ఉపవాసములున్న, ఖురానువిన్న, మ
క్కాదులుగన్న, నెమ్మది దయారసమన్నది సున్నయైనచో
నీ దరహాస చంద్రికలు, నిండవు, పండవు వానిభాగ్యముల్.

అంటాడు కరుణశ్రీ మానవుడు జీవన రసాన్ని పొంది సుఖంగా మనగల్గాలంటె గీతాచార్యుడు చెప్పిన మైత్రి-కరుణలు సాధించాలి. వీటి సాధనకై మనం వదులుకోవలసింది ద్వేషం. ఈనాటి సంకీర్ణ సమాజంలో ఈరెండు మార్గాలే మానవుని ప్రశాంతతకి చేర్చగలవి. ''అలాంటి వారి జన్మ యేధన్యమని'' వివేకానందులు సెలవిచ్చారు. మైత్రి, కరుణ సాధనలో మనముందాము.
(హైదరాబాద్ ఎ.ఐ.ఆర్. సౌజన్యంతో)

– చొడూరి గోపాలరావు.

## జాతి వినాశనానికి ఆలస్యం వుండబోదు

''సదాపరులచే అన్నాన్ని నోట పెట్టించుకొనే వాడి చెయ్యి క్రమంగా అన్నాన్ని నోట పెట్టుకొనే శక్తిని కోల్పోతుంది. ప్రతి విషయంలోను సదాయితరులచే రక్షింపబడే వ్యక్తి యొక్క ఆత్మ సంరక్షణ శక్తి ఎన్నడూ వికాసం పొందజాలదు. తల్లిదండ్రులచే సర్వదా బిడ్డవలె రక్షింపబడే మహాబలవంతుడైన యువకుడైనా కేవలం బిడ్డడుగానే వుండిపోతాడు... అన్ని వ్యవహారాల్లోను రాజుమీదే (ప్రభుత్వం మీదే) ఆధారపడుతూ ఆత్మ సంరక్షణ నిమిత్తం గాని, ప్రజాభ్యుదయ నిమిత్తంగాని పాటుపడటానికి ప్రయత్నించని జాతి క్రమంగా నిర్వీర్యమై బలహీనమై పోతుంది. అది దేశవినాశనానికి కారణమౌతుంది. వినాశనానికి ఆలశ్యం వుండబోదు.

– శ్రీ స్వామి వివేకానంద.

సేకరణ: చే రెడ్డి శ్రీరామ్‌రెడ్డి.

## మాస విశేషాలు :

**పుష్యం-మాఘం (ఫిబ్రవరి'97)**

4. తానాజీ బలిదాన్
5. గురుమౌఢ్యనివృత్తి
8. మాఘస్నానారంభం
14. రథసప్తమి – శివానంద జయన్తి
17. భీష్మ ఏకాదశి
18. శ్రీరామకృష్ణపరమహంస జయన్తి
20. శుక్రమౌఢ్య ప్రారంభం
27. చంద్రశేఖర అజాద్ బలిదానం.

**మాఘం-ఫాల్గుణం (మార్చి'97)**

5. శ్రీగురూజీ జయన్తి
7. మహాశివరాత్రి
18. స్వామిదయానందజయన్తి
23. భగత్‌సింగ్, సుఖదేవ్ రాజగురుల బలిదాన్
24. హోలీ
27. శివాజీ జయన్తి.



'జన సంక్షేమ సమితి' చెయ్యేరు గ్రామంలో ఇండ్ల నిర్మాణానికి శంకుస్థాపన చేస్తున్న
మా. శ్రీ.శేషాద్రిగారు, ప్రక్కన మా. శ్రీ.హల్దేకర్‌జీ.



సంక్రాంతినాడు ఒంగోలు పట్టణంలో 'విశ్వకల్యాణ దినోత్సవ'
సమయంలో వేదిక-కార్యకర్తలు.